4.10.1996 శుక్రవారం 12 పేజీలు సంపుటి:68 సంచిక:40 విడిప్రతి రూ.2.00లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



## సముద్రం నింపడానికా ...

నెల్లూరు జిల్లా రైతుల చిరకాల స్వప్నం – సోమశిల! కొన్ని తరాలుగా అమాయక రైతాంగానికి అరటి బంగారు కల; గగన కుసుమం దానిపై ఎన్నెన్ని ఆశలో; దాని కోసం ఎన్నెన్ని పోరాటాలో! చరిత్ర పుటలు తిరగేస్తే వందేళ్లకు పైనుంచి ఈ ప్రస్తావన కన్పిస్తుంది. సర్ ఆర్థర్ కాటన్ దినాలలోనే; నెల్లూరు, సంగం ఆనకట్టలు కట్టిన రోజులలోనే ఇంజనీర్ల మెదళ్లలో తళుక్కున మెరిసిన జలాశయమిది. పడమటి కొండలలో పుట్టి, పరుగు పరుగున, వెనుక నుంచి తననెవరో తరుముకొని వస్తున్నట్లు ఉరకలెత్తుతూ – తూర్పు సముద్రుడి కౌగిలిలో ఒదిగి పోయే పెన్నమ్మకు పగ్గాలు బిగించి, ముకుతాడు తగిలించి సోమశిల పర్వత సానువుల్లో నిలవేయాలని, నీటినంతటినీ నిలువ చేయాలని తలపెట్టిన ప్రాజెక్టు సోమశిల. బ్రిటీషు కాలంలోనే నెల్లూరు రైతులు ఈ కోరిక విన్పించిన దాఖలా లున్నాయి. అప్పటి నుంచి ఇప్పటి వరకు ఎంతో ఆశ పడి, ఆరాటం చెంది, ఆందోళన చేసి, ఎదురు తెన్నులు చూసి, సాధించుకొన్న కల్పతరువు ఇది. కామధేనువు వలె అడిగి నప్పుడల్లా, అడిగినన్ని నీళ్లు జలజలమని వదుల్తుందని; అవి గలగల మంటూ పారి, తమ మాగాణులకు జీవం తెస్తాయని; పసిడి పంటలు పండిస్తాయని; తమ తలరాతలు మారుస్తాయని రంగుల కలలు అల్లుకున్నారు అమాయక రైతులు.



కాని జరిగిందేమిటి? జరుగుతున్న దేమిటి? నెల్లూరు జిల్లా రైతాంగం కన్న కలలకు ప్రతిరూపంగా నిలవాల్సిన ప్రాజెక్టు – నాయకుల నిర్లక్ష్యానికి, అధికారుల అవినీతికి, కాంట్రాక్టర్ల ధనదాహానికి ప్రతీకగా నిలబడి వుంది. పరుగు ఆపి, డ్యాం వరద గేట్ల దగ్గర ఒక్క సెంకరు ఆగి, మన చేతకాని తనాన్ని వెక్కిరించి, క్రిందకు దూకి, యధాప్రకారం కడలి ఒడిలో కలిసి పోవడానికి ఉరకలెత్తుతూ పారుతూంది పెన్నమ్మ. డ్యాంపై నిలబడి వరద గేట్ల నుంచి క్రిందకు దూకి వస్తున్న నీటి ప్రవాహపు గలగల శబ్దాలు వింటుంటే – అవి పెన్నమ్మ తల్లి మనల్ని గేలిచేస్తూ పకపకమని నవ్వే శబ్దాలేమో నన్పిస్తున్నాయి. ఆ దృశ్యం చూస్తుంటే – ఆదమరచిన కంసాలి కొలిమిలో కరిగి కాల్వలు కట్టిన అపరంజి ద్రవపు ధారలు స్ఫురణకు వస్తున్నాయి. నిప్పు, లిప్పు మధ్య స్లిప్ అయ్యి, నేలకు జారిపోతున్న అమృత ధారలుగా కన్పిస్తున్నాయి.

ఎన్ని నీళ్లు? ఎంతటి ప్రవాహం? వృధాగా, దండగగా, దుబారాగా పెన్న కడుపులోని గనులనన్నిటినీ కరిగిస్తూ, కడలికి చేరువ కాను తొందర పడుతూ వెళ్లిపోతున్నాయి. తొలకరితో ప్రారంభమైన ఈ మూడునెలల్లో 70 టిఎంసిల నీరు ఇట్లా డ్యాం నుంచి క్రిందకు జారిపోయాయి. ఒక్కొక్క టిఎంసి నీటితో పదివేల ఎకరాల వరిపైరు పండించవచ్చు. వృధాగా సముద్రంలో కలిసి పోయిన ఈ 70 టిఎంసిల నీరు 7 లక్షల ఎకరాల పారుదలకు సరిపోయి వుండేది. ఒక్క ఎకరాలో పండే వరి పంట విలువ 10 వేల రూపాయలని భావిస్తే – ఈ 7 లక్షల ఎకరాలలో 700 కోట్ల పంట ఉత్పత్తి సాధ్యమయ్యేది. ఆ నీటి సంతటినీ భద్రంగా దాచి పెట్టుకొని వుంటే – నెల్లూరు, కోవూరు డెల్టాలు; కావలి, కనుపూరు కాల్వలు; కండ్లేరు ఆయకట్టులలోని మొత్తం భూభాగానికి కనీసం రెండు సంవత్సరాలు నీటి చిక్కులు ఎదురై వుండవు. జిల్లాలోని మాగాణి సాగు సమస్తం రెండు పంటలతో దివ్యంగా జరిగి వుండేది. రైతులు బాగుపడి వుండేవారు. ఎంతటి కరవు పరిస్థితు లేర్పడినా – జిల్లాలో ఎక్కడా మంచినీళ్ల సమస్య అన్న మాట విన్పించి వుండేది కాదు.

కాని ఏమి లాభం? ఇదంతా వట్టి కంఠశోష; తలచు కొంటే కడుపులో మంట. ఆ నీళ్లన్నీ ఎప్పుడో సముద్రపు ఉప్పులో కలిసి పోయాయి; కలుస్తూనే వున్నాయి; ఇక ముందూ కలిసి పోతాయి; మనం చూస్తూనే వుండాలి; చేయ గలిగింది ఏదీ లేదు.

ఏమిటి దీనికి కారణం? ఎవరు

కారణ 7 పేజీలో



మన చేతకానితనాన్ని గేలిచేస్తూ గలగల మంటూ వరద గేట్ల నుంచి క్రిందకు దూకుతున్న సోమశిల జలనిధి.

## సోమశిల నిర్మించింది?

అరడజన్ మందిని వూడబెరికి... డజను మందికి ఇచ్చేట్లున్నారు!

## మంత్రిత్వ తాయిలం పంచక తప్పేట్లు లేదు!

రాష్ట్ర మంత్రివర్గ ప్రక్షాళనకు మూహూర్తం దగ్గర పడుతున్నది. ఈ నెల 11వ తేదిన ఉపఎన్నికలు ముగియగానే ముఖ్యమంత్రి రాష్ట్ర మంత్రి వర్గం మార్పులు - చేర్పులపై దృష్టి సారించే అవకాశం వుంది. చంద్రబాబు ముఖ్యమంత్రి అయి గత ఏడాదిగా మంత్రి పదవుల్ని తాయిలంగా చూపి ఎమ్మెల్యేల్ని ఊరిస్తున్నారు. మొదట 11మందితో ఏర్పాటైన మంత్రి వర్గాన్ని నెల రోజుల తర్వాత విస్తరించి మరో 15 మందికి మంత్రి పదవుల యోగం కల్పించారు. మొత్తం 26 మందిలో హరికృష్ణ రాజీనామా చేయడం, ఆ తర్వాత లోక్ సభ ఎన్నికల్లో పోటీచేసి గెలుపొందిన రమణ, అయ్యన్నపాత్రుడు, వేణుగోపాలాచారి మంత్రి వర్గం నుంచి తప్పుకోవడంతో బాబు మంత్రి వర్గ సంఖ్య 22కు తగ్గిపోయింది. గత ఏడాదిగా, మంత్రి వర్గ విస్తరణ అదిగో... ఇదిగో అంటూ ఊరిస్తూ వస్తున్న బాబుపై ఒత్తిడి అధిక మవుతోంది.

హరికృష్ణ, కాళహస్తి గోపాల్ మెడల మీద కూర్చుని వున్నారు!

ముఖ్యంగా ఎన్టీఆర్‌ను పదవిచ్యుతుర్ని చేసి చంద్రబాబును గద్దె నెక్కించడంలో ప్రధాన పాత్ర వహించిన కాళహస్తి ఎమ్మెల్యే గోపాలకృష్ణారెడ్డి, నిజామాబాద్ జిల్లా డిచ్‌పల్లి ఎమ్మెల్యే వెంకటేశ్వరరావు, మెదక్ జిల్లా సిద్దిపేట ఎమ్మెల్యే చంద్రశేఖరరావు, హిందూపూర్ ఉపఎన్నికల్లో గెలిచిన నందమూరి హరికృష్ణ, మంత్రి పదవుల కోసం బాబును సతాయిస్తున్నారు. వీరుగాక శాసన సభ స్పీకర్ యనమల రామకృష్ణుడు, డిప్యూటి స్పీకర్ ఫరూక్ కూడా మంత్రి పదవుల కోసం ఆశపడుతున్నారు. గత పార్లమెంటు ఎన్నికల్లో 'దేశం' అభ్యర్థుల విజయానికి కృషి చేసిన పలువురు ఎమ్మెల్యేలు కూడా తమ కృషికి గుర్తింపు కావాలని ముఖ్యమంత్రిని బలవంత పెడుతున్నారు. ఈ పరిస్థితుల్ని దృష్టిలో పెట్టుకొని చంద్రబాబు మొదట తన మంత్రి వర్గంలో 'అసమర్థుల్ని' ఏరివేసే కార్యక్రమాన్ని చేపట్టాలను కొంటున్నారు. గత ఏడాదిగా మంత్రి వర్గ సహచరుల పనితీరును ఆయన కంప్యూటర్‌లో మదింపు చేస్తున్నారు. కంప్యూటర్‌లో లభించే 'మార్కుల' ఆధారంగా మంత్రుల ఆయుష్షు నిర్ణయమవు తుంది. ఇప్పటి వరకు అందిన సమాచారం ప్రకారం ప్రస్తుతం వున్న 22 మంది మంత్రుల్లో కనీసం అరడజను మందికి కంప్యూటర్‌లో ఫెయిల్ మార్కులు వచ్చినట్లు విశ్వసనీయ వార్త. లెక్కల ప్రకారం కడప జిల్లా నుండి వీరారెడ్డి, తూర్పు గోదావరి జిల్లా నుండి మెట్ల సత్యనారాయణ, మహబూబ్ నగర్ జిల్లా నుండి డాక్టర్ జనార్థనరెడ్డి, నిజామాబాద్ జిల్లా నుంచి బషీరుద్దీన్ బాబూఖాన్, హైదరాబాదు నుండి యాదవులు కంప్యూటర్ పరీక్ష తప్పారని వారికి ఉద్వాసన తప్పదని అంటున్నారు.

తూర్పుగోదావరి జిల్లాకు చెందిన మంత్రి మెట్ల సత్యనారాయణ కంప్యూటర్‌లో కింది నుంచి రెండో ర్యాంకు లభించింది. ఇంటా బయటా ఉలకని - పలకని మంత్రిగా మెట్ల సత్యనారాయణ పేరు తెచ్చుకొన్నారు. జిల్లా మంత్రిగా మెట్ల వారి ఉనికి నామాపు శూన్యమనే చెప్పాలి. ఇటీవలి విద్యుత్ ఛార్జీలు, నీటి తీరువా పెంపుతో

కారణ 11 పేజీలో

కృష్ణాపట్నం లేదా దుగరాజపట్నంలో

# ఐదువేల కోట్ల పెట్రోలియం కాంప్లెక్స్

నెల్లూరు జిల్లాలో పెట్రో కెమికల్ కాంప్లెక్స్ నిర్మాణానికి నాంది ప్రస్తావన జరుగు తూంది. పదారు క్రితమే ఈ ప్రతిపాదన వచ్చింది. అప్పుడు జమీన్ రైతులో, మొదటి పేజీలో ఈ విషయం ప్రముఖంగా ప్రకటించడం జరిగింది. కాని ఆనాడు దానిని ఎవరూ విశ్వసించ లేదు. అంత పెద్ద ప్రాజెక్ట్ జిల్లాకు వస్తుందనే నమ్మకం లేకపోవడమే దీనికి కారణం. అయితే ఆ వార్త ఇప్పుడు నిజమైంది.

అమెరికాలో వున్న ఆంధ్రులు కొందరు కలిసి — ఊసెక్స్ పెట్రోలియం కాంప్లెక్స్ పేరిట ఈ బృహత్తర ఫ్యాక్టరీ నిర్మిస్తున్నారు. 5 వేల కోట్ల రూపాయల పెట్టుబడితో నిర్మితమౌతున్నది పరిశ్రమ. ఇందు కోసం వారు వాకాడు మండలంలో స్థలం అడిగారు. 3 వేల ఎకరాల విస్తీర్ణం గావాలి వారికి. అది సముద్ర తీరంలో

> అమెరికా ఆంధ్రులు ముందు కొచ్చారు;
> రాష్ట్ర ప్రభుత్వం ఆసక్తి చూపింది;
> జిల్లా అదృష్టం ఎట్లా వుందో మరి!

వుండాలి. గుజరాత్ రాష్ట్రంలో ఎస్సార్, రిలయన్స్ సంస్థలు, కర్ణాటకలో బిర్లాలు ఇటువంటి కాంప్లెక్స్‌లు నిర్మించారు.

పెట్రోలియం ద్వారా వివిధ రసాయనాలను, ఉత్పత్తులను తయారు చేయడం జిఎసెక్స్ లక్ష్యం. పూర్తి విదేశీ పెట్టుబడితో నిర్మితమౌ తుంది. ఈ కాంప్లెక్స్ వచ్చే చోట మినీ పోర్టు వసతులు ఏర్పడతాయి. ఆయిల్ జెట్టీలు నిర్మిస్తారు. పెద్ద పైపులైన్ ఏర్పడుతుంది. పలు అనుబంధ పరిశ్రమలకు అవకాశం కలుగుతుంది. విస్తారంగా ఉపాధి సౌకర్యాలు ఏర్పడతాయి.

రాష్ట్ర ప్రభుత్వం తరపున 3 వేల ఎకరాల స్థలం, రోజుకు పది మిలియన్ గ్యాలన్ల నీరు సరఫరా చేయడానికి ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు సూత్రప్రాయంగా అంగీకరించారు. వాకాడు మండలంలోని దుగరాజపట్నం, కొండూరు, కొండూరుపాళెం, పంట్రంగం తదితర గ్రామాలలో విస్తారంగా వున్న ప్రభుత్వ భూములను, కొద్దిగా ప్రైవేటు భూమిని సేకరించి ఇచ్చే విషయం పరిశీలనలో వుంది. అయితే అక్కడ పక్షుల సంరక్షిత కేంద్రం వల్ల కొన్ని సమస్యలు తలెత్తె ప్రమాదం వుండడంతో ప్రత్యామ్నాయంగా కృష్ణాపట్నం పరిసరాలలో భూసేకరణ తలపెడు తున్నారు. చంద్రబాబు నాయుడు ఏడాది క్రితం పార్లమెంట్ ఎన్నికల ప్రచారం కోసం చేసిన ఇండస్ట్రియల్ పోర్టు సిటీ అనే ఉత్తుత్తి ప్రచారం — ఈ ఫ్యాక్టరీ ప్రతిపాదనతో జీవం పోసుకొంటున్నది. అయితే ఇప్పటి వరకు దీనిపై ఎటువంటి నిర్ణయమూ జరగలేదు. ప్రతిపాదన పరిశీలనలో మాత్రమే వుంది.

మద్రాసుకు దగ్గరగా, నెల్లూరు జిల్లాలో ఈ కాంప్లెక్స్ నిర్మించాలని ఆ అమెరికా ఆంధ్రుల సంకల్పం. ఇందుకు ప్రభుత్వం సహకరిస్తే వారు సిద్ధం; ఆ సహకారం అందకుంటే వారికి గుజరాత్

కొరవ 11 పేజీలో

## కావలి పట్టణ వైభవం

—శర్మ

ఏ వీధి జూచిన — ఏ వాడ కనుగొన్న
నిలువెత్తు పెంట కుప్పల పసందు.
ఏ సందు చెవిబెట్టి ఏ గొంది నాలింప
మశక సంహతి గాన మధురిమలు
ఏ దారి దర్శింప ఏ డొంక కనువిప్ప
పసద సూకర కపి సముదయములు
ఏ యెడ మూర్కొన ఏ చోట కాలిడ
మురుగు కాల్వల దివ్య పరిమళములు
శాపికేషను మచ్చుకు కానరాదు
కన్ను లుండియు అధికార్లు కానరారు
భళిర! కావలి పట్టణ వైభవంబు
చెప్ప శక్యమె తిరుమల శ్రీనివాస!

# బొంబాయి స్టాక్ ఎక్ఛేంజి అడుగున పడిపోయింది!

దేశంలో పెద్ద మార్కెట్ పతనావస్థకు బొంబాయి స్టాక్ ఎక్ఛేంజి పనితీరు అద్దం పడుతూంది. దేశంలో కెల్లా పురాతనమైన ఎక్ఛేంజి ఇది. భారతీయ షేర్ మార్కెట్ అంటే — బొంబాయి మాత్రమేనని భావించే వారింత కాలం. అందులో 8 వేల కంపెనీలు తమ షేర్లను లిస్ట్ చేసి వున్నాయి. రోజుకు కొన్ని వందల కోట్ల రూపాయల ట్రేడింగ్ జరిగేది. పెద్ద బ్రోకర్లందరూ వుండేది అక్కడే!

అటువంటి స్టాక్ ఎక్ఛేంజి ఇప్పుడు అత్యంత దీనస్థితిలో కొట్టుమిట్టాడు తున్నది. నేషనల్ స్టాక్ ఎక్ఛేంజి ప్రథమ స్థానం ఆక్రమించడంతో, బొంబాయి ప్రాధాన్యత పడిపోయింది. ఎన్ఎస్ఇలో 1200 కంపెనీలు మాత్రమే లిస్ట్ అయినప్పటికీ, వారి విసాట్ విధానం వల్ల, మని టెలివిజన్ ద్వారా జరిగే గాంబ్లింగ్ వల్ల, అత్యధిక పరిమాణంలో ట్రేడింగ్ జరుగుతున్న దిక్కిది ఎన్ఎస్. పెద్ద ఇన్వెస్టర్లందరూ నేరుగా ఎన్ఎస్ఇ ద్వారా తమ లావాదేవీలు నిర్వహించు కొంటున్నారు. అయితే అది ట్యాక్సీల పరి జాగ్రత్తగా పనిచేస్తున్నది. వెయ్యి కోట్ల వరకు ట్రేడింగ్ జరుగు తుంటే — నిజంగా పెద్ద సెటిల్మెంట్ల మార్జిన్ 5 శాతం (50 కోట్ల రూపాయలు) కూడా లేదు. తక్కిన

**షేర్ లోకం**
**డా. ఎ. దుర్గాప్రసాద్**

దంతా జూదమే!

ఎన్ఎస్ఇ తర్వాత స్థానం కలకత్తా స్టాక్ ఎక్ఛేంజి ఆక్రమించింది. ఇందుకు కారణం — అక్కడ ఇప్పటికి బదలా వంటి సాంప్రదాయ పద్ధతులు అమలులో వుండడం. బిగ్‌బుల్ హర్షద్ మెహతా ఇప్పుడు అక్కడి నుంచి తన లావాదేవీలు నిర్వహిస్తున్నారని అనుమానిస్తున్నారు. కొరవ 11 పేజీలో

# దేశంలో కెల్లా పెద్ద బ్యాంకు విశాఖలో నెలకొల్పనున్న దుబాయ్ ఆంధ్రులు!

దేశంలో కెల్లా అతిపెద్ద బ్యాంకు స్థాపనకు ఒక ఆంధ్రుడు ముందుకు వచ్చారు. 1050 కోట్ల మూలధనంతో విశాఖ పట్టణం కేంద్రంగా, ట్రేడ్ అండ్ కామర్స్ బ్యాంకు అనే పేరుతో దీన్ని స్థాపిస్తున్నారు. దీని స్థాపకులు నలుగురైతే — అందులో ఆంధ్రుడైన శ్రీ జి. దశరథ రామిరెడ్డి చీఫ్ ప్రమోటర్. వీరు నలుగురూ దుబాయ్ కేంద్ర స్థానంగా పరిశ్రమలు, వ్యాపారాలు నిర్వహిస్తున్నారు. ఈ నలుగురూ కలిసి 400 కోట్ల రూపాయలు పెట్టుబడి పెడుతున్నారు; తతిమా 650 కోట్ల రూపాయలు ఇతరుల నుంచి సేకరిస్తున్నారు.

ఇంత పెద్ద పెట్టుబడితో ఏర్పాటయ్యే బ్యాంకు దేశంలో ఇదే! ఇప్పుడు దేశంలో కెల్లా పెద్ద బ్యాంక్ అయిన స్టేట్ బ్యాంక్ మూలధనం కేవలం 474 కోట్లు. అతి పెద్ద ఆర్థిక సంస్థగా మనం భావించే ఐడిబిఐ మూలధనం 673 కోట్లు. ఐసిఐసిఐ పెట్టుబడి కేవలం 388 కోట్లు. ఈ మూడింటి కంటే పెద్దదిగా ఈ బ్యాంకు ప్రారంభం కానున్నది.

# రక్తపు మడుగులో ప్రజాస్వామ్య కమలం

కాశ్మీర్ రాష్ట్రంలో ఎన్నికల ప్రక్రియ దిగ్విజయంగా, ప్రశాంతంగా జరిగి పోయింది. రక్తపు మడుగులో ప్రజాస్వామ్య కమలం రేకలు విప్పి విరబూసింది. చరిత్రాత్మక సంఘటన ఇది; గాడితప్పిన కాశ్మీర్ భవితవ్యాన్ని తిరిగి దారిలో పెట్టగల ఒక గొప్ప రాజకీయ మలుపు ఇది.

వివిధ దశలలో ప్రశాంతంగా, సమగ్రంగా జరిగిన రాష్ట్ర శాసనసభ ఎన్నికలలో - ఫలితాలు ప్రకటించిన 81 స్థానాలకు గాను 54 సీట్లు గెల్చుకొని నేషనల్ కాన్ఫరెన్స్ ప్రభుత్వం స్థాపించింది. మాజీ ముఖ్యమంత్రి కాశ్మీరీయుల హృదయాలలో జననేతగా తన స్థానాన్ని పదిలంగా కాపాడు కొంటూ వస్తున్న ఫరూఖ్ అబ్దుల్లా కొత్త ప్రభుత్వ నేతగా ప్రమాణం స్వీకరించారు.

కాంగ్రెస్, బిజెపిలకు చెరి 7స్థానాలు మాత్రమే లభించాయి. దేశమంతటి వలెనే ఇక్కడా కాంగ్రెస్ ప్రజల నిరాదరణకు గురికావడం గమనించవలసిన విషయం.

ఎవరు గెల్చారు, ఎవరు ఓడారు అన్న మీమాంస కంటే - అసలు ఎన్నికలు జరిపించడమే ఒక ఘన విజయంగా పరిగణించాలి. 1987 తర్వాత కాశ్మీర్‌లో ఏ ఎన్నికకు సానుకూల వాతావరణం లేదు. అప్పుడు గెల్చిన ప్రభుత్వం కూడా చాలా స్వల్ప కాలమే పరిపాలన చేయగల్గింది. పాకిస్తాన్ ప్రత్యక్ష ప్రమేయంతో, విష ప్రచారాలతో, విద్వేష భావాలతో, వేర్పాటు తత్వంతో కాశ్మీరీ యువత పెడదారి పట్టి, తుపాకులు చేతపట్టి ఉగ్రవాదం పేరిట ఉన్మాద పూరితమైన విధ్వంస కాండకు పూనుకోవడంతో కాశ్మీర్ అల్లకల్లోలమై పోయి వుండిందింత కాలం. రంగుల కలను తలపింపజేసే ప్రకృతి రమణీయతకు ప్రతీక అయిన ఆ సుందర ప్రదేశం స్మశాన సదృశంగా మారింది. అందానికి ప్రతిబింబం వంటి సొగసైన సరస్సులు రక్తపు మడుగులుగా మారిపోయాయి. మొత్తం రాష్ట్రం భద్రతాదళాల పరిష్వంగనలో చిక్కిపోయింది. కోకిలల స్వరాలు, పక్షుల రెక్కల టపటపల శబ్దాల స్థానంలో బాంబు ప్రేలుళ్లు, మరణ సమయంలో చేసే ఆర్తనాదాలు కాశ్మీరీయుల చెవులకు చిల్లులు పొడిచాయి. పొద్దున లేస్తే తిరిగి ప్రొద్దుగుంకేదం చూస్తామన్న నమ్మకం లేనంత భయోద్విగ్న పరిస్థితులలో నితుకుబితుకు మంటూ కాలం గడిపారు వారు.

ఇటువంటి దుర్భర, దుస్సహ పరిస్థితుల నుంచి బయటపడి ప్రశాంత జీవనం గడిపే అవకాశం ఎన్ని సైనిక చర్యలు జరిపినా; ఎన్ని దళాల సేన కాపలా కాచినా దుర్లభమని చరిత్రలో పలుసార్లు రుజువైంది. ప్రజల మద్దతుతో ప్రజాస్వామ్య రాజకీయ ప్రక్రియ ద్వారానే ప్రశాంతత సాధ్యమౌతుందని పంజాబ్‌లో చూశాం మనం. అందువల్లే కాశ్మీర్‌లో ఎన్నికలు జరిపించడానికి కేంద్ర ప్రభుత్వం అంత ఆరాట పడింది. కాని ఒక దశాబ్దం పాటు కృషి సల్పితేనే కాని అది సాధ్యం కాలేదు.

ఇప్పటికైనా అది సాధ్యం కావడం హర్షణీయ పరిణామం. ఎన్నికల కమీషన్, భద్రతా దళాలు, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ అధికారులు అహోరాత్రులు శ్రమించి; అత్యంత మెళకువతో వ్యవహరించి ఈ అసాధ్యాన్ని సుసాధ్యం చేశారు. పాకిస్తాన్ ప్రభుత్వం ఈ ఎన్నికలను అడ్డుకోవడానికి ఎన్ని కుట్రలు పన్నిందో లెక్కలేదు. ఆఫ్ఘనిస్తాన్ నుంచి కిరాయి. కిరాతక మూకాలులను దించి; అత్యంత శక్తివంతమైన మారణాయుధాలు వారికి సమకూర్చి ఎన్నికల ప్రచారం జరగకుండా, పోలింగ్ కొనసాగకుండా, ప్రజలు ఓటు వేయకుండా చూడాలని కుట్ర పన్నారు. రాకెట్లు పేల్చి, బాంబులు వేసి భయభ్రాంతులను చేయాలని చూశారు. కానీ సైనికుల చిత్తశుద్ధి, ప్రజల మనోధైర్యం వల్ల ఆ కుట్రలు ఫలించ లేదు. రాష్ట్రం మొత్తం మీద 53శాతం మంది ప్రజలు ఓటు వేశారు. ఇది చాలా అభినందనీయ విషయం.

జమీన్‌రైతు

అం ఐతే కేవలం ఎన్నికలు జరపగానే కాశ్మీర్ సమస్య పరిష్కారం కాదు. పరిష్కార ప్రయత్నానికి ఇది నాందీ మాత్రమే. ప్రజా ప్రభుత్వపు సక్రమ నిర్వహణ ద్వారా ప్రజలలో విశ్వాసం కల్గించాలి; ఉగ్రవాదులకు నిలువ లేకుండా చేయాలి; వేర్పాటు వాద ధోరణులను రూపు మాపాలి. కాశ్మీరీ యువతలో పాకిస్తాన్ పట్ల చాలా భ్రమలున్నాయి. నచ్చచెప్పి, వాటివల్ల కల్గే ప్రమాదాలు వివరించి, పాకిస్తాన్ నిజ స్వరూపం వారికి అర్థమయ్యేటట్లు చేసి యువతను జాతీయ జీవన స్రవంతి వైపు ఆకర్షించడం కాశ్మీర్ ప్రభుత్వ ప్రథమ కర్తవ్యం. అందుకు ఫరూఖ్ అబ్దుల్లా చాలా పట్టుదలతో, ఓర్పుతో కృషి చేయవలసి వుంటుంది. ఆయనకు కేంద్ర ప్రభుత్వము చాలా సహకారం అందించాలి.

ఎన్నికలు ముగియగానే ఫరూఖ్ అబ్దుల్లా పార్టీని తన మంత్రి వర్గంలో చేరవలసిందింగా ఆహ్వానించి ప్రధాని దేవగౌడ ప్రశంసనీయ నిర్ణయం తీసుకున్నారు. కాశ్మీర్ ప్రజలు విశ్వసించే పార్టీ కేంద్రంలో భాగస్వామిగా వుంటే - వారికి భారత ప్రభుత్వం పట్ల నమ్మకం కల్గుతుంది. వారిలో జాతీయ భావాలు రేకెత్తించడం సులభమౌతుంది.

ఫరూఖ్ అబ్దుల్లా పరిపూర్ణ జాతీయ వాది. ఏ దశలోనూ వేర్పాటువాదాన్ని సమర్థించని ఏకైక కాశ్మీర్ నాయకుడాయన. అటువంటి నేత నేతృత్వంలో రాష్ట్ర ప్రభుత్వం ఏర్పడడం ఒక శుభ పరిణామం. కాశ్మీర్‌లో ప్రశాంతతను నెలకొల్పి; భరత మాత శిరస్సు నలంకరించిన నెమలి పింఛం వలె కాశ్మీర్‌ను నిలబెడతారని ఆశిద్దాం. *



4-10-46
పేజీలు:8 వెల:0-1-6

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### భారత సర్వసేనాని నేతాజీ?

నేతాజీ సుభాస్ చంద్రబోసు ఇండియాలోనే ఉన్నారనీ, తను భారత దేశపు తొలి సర్వసేనాని కావాలని వాంఛిస్తున్నాడనీ, అందుకు గాను తను ఆజాద్ హింద్ ఫౌజ్ సర్వ సేనానిగా ఉండి అనుభవం గడించాననీ, కాంగ్రెస్ అధ్యక్ష పదవిపై వారికి ఇచ్ఛలేదనీ, ఈ సంగతంతా తన కుటుంబీకులకు తెలియజేసినట్లు - జవహర్ లాల్‌కు గూడ తెలిసినట్లు తెలియుచున్నది.

### ఆడవాళ్ల సంతోషం

అక్టోబరు 2తేది నుండి మద్రాసు రాజధానిలో చిత్తూరు, కడప, కర్నూలు, బళ్ళారి అంటే 50వేల చదరపు మైళ్ల వైశాల్యమున మద్య నిషేధం అమలు జరుపబడింది. దీనికి గాను ముఖ్యంగా త్రాగుబోతుల భార్యలు ఎక్కువ సంతోష పడుతున్నారు.

### సంయుక్త రాష్ట్రంలో సమిష్టి వ్యవసాయం

సంయుక్త రాష్ట్రంలో జమీన్దారీలను తీసేసి, భూముల నన్నిటిని పంచాయతీల క్రిందకు తీసుకొని రష్యాలో వలె సమిష్టి వ్యవసాయము చేయుటకు కొన్ని జిల్లాల్లో ప్రారంభం చేశారు. వారంతట వారు భూస్వాములు పంచాయతీలకు తమ భూములను అప్పజెప్పాలి. అలా కాకుంటే బలవంతంగానే లాగేస్తారు. సుమారు 700 గ్రామాలు యిప్పటికి పంచాయతీల క్రిందకు వచ్చాయి. ఫలితం విజయ వంతంగా కనిపిస్తుంది.

### రామబ్రహ్మం గారి అస్తమయం

పత్రికా రచయిత, ఫిలిం నిర్మాత, ఫిలిం దర్శకుడు అయిన గూడవల్లి రామబ్రహ్మంగారి అకాల మరణానికి చింతించని వారుండరు. సమదర్శనిలో సహాయ సంపాదకులు గాను, ప్రజామిత్ర కధిపతులుగా నుండి పత్రికా రచనకు దోహద మిచ్చారు. సరస్వతి టాకీసు, సారథీ ఫిలిమ్సు, శారదా ప్రొడక్షన్స్ మున్నగు ఫిలిం కంపెనీలు నిర్మించి నిర్మాతగా పేరు సంపాదించారు. ద్రౌపది వస్త్రాపహరణం, మాలపిల్ల, రైతుబిడ్డ, పంతులమ్మ మున్నగు ఫిల్ములకు దర్శకులుగా నుండి తన భావాల్ని, పల్లెటూరు దృశ్యాలను చిత్రించి ఆంధ్రలోకాన్ని చూరగొన్నారు. కొద్ది కాలంలోనే విరయశస్సును గడించి అసువులు వీడిన రామబ్రహ్మంగారి యాత్మకు

కొరవ 10 పేజీలో

# మహిళలకు రిజర్వేషన్లు మనస్ఫూర్తిగా సమర్థించాలి!

తరతరాలుగా పురుషాధిక్యతకు బలైపోతున్న మహిళలకు చట్టసభల్లో 33 శాతం రిజర్వేషన్లు కల్పిస్తూ పార్లమెంటులో బిల్లు ప్రవేశ పెట్టడం ముదావహం. మహిళా ప్రతినిధిగా స్వర్గీయ శ్రీమతి ఇందిరా గాంధీ భారత దేశానికి ప్రపంచంలో ఎనలేని ఖ్యాతి తెచ్చారు. గోల్డా మెయిర్, మార్గరెట్ థాచర్, బెనజీర్ భుట్టో, చంద్రికా కుమార తుంగ, సిరిమావో బండారు నాయకె వంటి మహిళా ప్రముఖులు ప్రపంచ ప్రసిద్ధి గాంచి మహిళల పేరు నిలబెట్టారు. సరోజిని నాయుడు, దుర్గాబాయి దేశ్‌ముఖ్ వంటి స్త్రీలు స్వాతంత్ర్య పోరాటంలో ముందున్నారు. ఝాన్సీ లక్ష్మీబాయ్, దుర్గాభాయి దేశ్‌ముఖ్, రాణీ రుద్రమదేవి బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఎదిరించి ఖ్యాతి గాంచారు. జనాభాలో పురుషుల కంటే స్త్రీలే ఎక్కువగా ఉన్నప్పటికీ ప్రజా జీవితంలో వారి ప్రమేయం నామ మాత్రంగా ఉంది. 33 శాతం రిజర్వేషన్ల బిల్లు మూలంగా దేశం నలు చెరగులా అన్ని రంగాల్లో మహిళా చైతన్యం వెల్లివిరియాలని మనసారా కోరుకొంటున్నాను.

మాగుంట పార్వతమ్మ
ఒంగోలు పార్లమెంటు సభ్యురాలు

### ఉచిత సలహా లెందుకు?

ఉచిత సలహాలివ్వడంలో వృద్ధతరం నాయకుడు నల్లపు రెడ్డి చంద్ర శేఖర్ రెడ్డి మునాపాటి. ఎందువల్లో ఈ మధ్య ఆయనకు స్వర్గీయ పొట్టి శ్రీరాములు, ఎసి సుబ్బారెడ్డి గారల మీద

## జనవాణి

అవ్యాజ్యమైన అనురాగం పుట్టుకొచ్చింది. వారం క్రితం ఒక సభలో మాట్లాడుతూ నెల్లూరు జిల్లాను పొట్టి శ్రీరాములు జిల్లాగాను, నెల్లూరు టౌన్ పేరును ఎసి నగర్‌గాను మార్చి పారేయమని సలహా

ధి

యిచ్చా రాయన. చంద్ర శేఖర్ రెడ్డి గతంలో ఎన్నో అధికార పదవులు నిర్వహించారు. ఆ సమయంలో ఎందువల్లో ఆయనకు ఈ నాయకులు గుర్తుకు వచ్చినట్లు లేదు. పాత తరం పేర్లను మార్చడం రాజకీయ నాయకులకు ఈ మధ్య కొత్త ఫాష్యంగా పట్టుకొంది. అందంగా వున్న బొంబాయి పేరు ముంబాయి చేస్త్రే, మద్రాస్ పేరు చెన్నై చేసి పారేసారు. ఎవరో ఒకాయన ఇండియా పేరును 'గాంధీ ఇండియా' చేసి వేయమన్నాడు. నెల్లూరులో పొట్టి శ్రీరాములు గారి పేరుతో కొన్ని స్మారక చిహ్నాలున్నాయి. ఎసి సుబ్బారెడ్డి గారి పేరుతో అయితే లెక్కలేనన్ని.

కొరవ 8 పేజీలో

# ఛైర్మన్‌ను ఇరికించబోయి తామే ఇరుకున పడ్డారు!

28వతేది మునిసిపల్ ఛైర్ పర్సన్ ఆనం వివేకానందరెడ్డి అధ్యక్షతన జరిగిన మునిసిపల్ సమావేశంలో వాడి, వేడి చేటు చేసుకున్నాయి. సిపిఎం కౌన్సిలర్లు, ఇతర పార్టీల కౌన్సిలర్లతో కలసి విజయమహల్ గేటు వద్ద నిర్మిత మవుతున్న బాక్స్‌టైప్ బ్రిడ్జి అప్రోచ్ రోడ్ల విషయంలో ఛైర్ పర్సన్‌ను నిలదీయాలని ఒక వ్యూహంతో సమావేశానికి వచ్చారు. కాని వివేకా తెలివిగా కౌన్సిలర్ల పోరాట ధోరణికి మద్దతు పలికి, ఈ విషయమై పోరాటేందుకు కౌన్సిల్ సభ్యులతో కలసి హైదరాబాదు వెళ్లేందుకు సంసిద్ధత వ్యక్త పరచడంతో ప్రతి పక్షీయులకు ఏం చేయాలో పాలుపోలేదు. రెండున్నర గంటలపైగా జరిగిన సమావేశంలో [illegible] కౌన్సిలర్లు బాక్స్ టైప్ బ్రిడ్జి [illegible] రోడ్ల విషయం మాటే [illegible]రారు. దీని వల్ల ఎప్పటి మాదిరే సమావేశంలో చర్చించాల్సిన అజెండాలోని మిగతా అంశాలు మూల పడిపోయాయి.

సమావేశం ప్రారంభం కాగానే బాక్స్‌టైప్ బ్రిడ్జి పోరాట యోధుడు [illegible] వార్డు సభ్యుడు ఉన్నం [illegible]య్య లేచిమాట్లాడారు. నాలుగు నెలలైనప్పటికి బాక్స్‌టైప్ బ్రిడ్జి అప్రోచ్ రోడ్లకు సంబంధించిన ప్లాన్ ఆఫ్ యాక్షన్ అమలు జరగలేదు. దీని వల్ల బ్రిడ్జికి సంబంధించిన పనుల అంచనా వ్యయం 40లక్షల నుంచి కోటి రూపాయలకు చేరుకొంది. ఈ భారం ఎవరిపై వేస్తారని ప్రశ్నించారాయన. అప్రోచ్ రోడ్ల సమస్యను వాన విడు తుండటం వల్ల బాక్స్ టైప్ బ్రిడ్జి సమీప ప్రాంతంలోని ప్రజలు డ్రైనేజి, మంచినీటి సమస్యలు ఎదుర్కొంటున్నట్లు చెప్పారు. విజయ మహల్ గేటు వద్ద ఇప్పటికే 15మంది ప్రాణాలు కోల్పోయిన విషయం కూడా సభ దృష్టికి తీసుకొచ్చారాయన. కౌన్సిల్ ఎన్ని నిర్ణయాలు తీసు కొంటున్నప్పటికి అధికారులు నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తుండటంతో అప్రోచ్ రోడ్ల

**మునిసిపల్ సమావేశం**

నిర్మాణం ఆగిపోతున్నట్లు జనసయ్య ఆరోపించారు. తన వార్డులో అభివృద్ధి పనుల సంఖ్య తగ్గించి, ఆ నిధుల మొత్తాన్ని బాక్స్ టైప్ బ్రిడ్జి పనులకు కేటాయించాలని కౌన్సిలర్ సందాని బాషా కోరారు. ఐదుగురు కమీషనర్లు మారినా బ్రిడ్జి నిర్మాణం పూర్తి కాలేదని బిజెపి సభ్యుడు కప్పిర శ్రీనివాసులు ఆవేదన వ్యక్తం చేశారు. కౌన్సిలర్లు ఈ విషయమై హైదరాబాదు వెళ్లి పోరాటం చేయను ఛార్జీలకు గానుతన నాలుగు నెలల జీతాన్ని కౌన్సిలర్ మధుసూదన్ విరాళంగా ప్రకటించారు. చర్చకు మునిసిపల్ ఛైర్ పర్సన్ ఆనం వివేకానందరెడ్డి సమాధాన మిచ్చారు. 1982లో మునిసిపల్ వైస్ ఛైర్మన్‌గా వున్నప్పుడు బాక్స్‌టైప్ బ్రిడ్జి ప్రతిపాదన మునిసిపాలిటీలో నేనే ప్రవేశపెట్టాను. అధికారులు అవకతవకలుగా డిజైన్ చేయడం వల్ల ప్రస్తుతం ఇబ్బందులన్నీ వచ్చి పడ్డాయి. హైదరాబాదులోని డైరెక్టర్ ఆఫ్ టౌన్‌ప్లానింగ్ కార్యాలయంలో నిలబడి పోయి వున్న ఈ ఫైలుకు మోక్షం కల్పించను కౌన్సిలర్లు, అధికారులు, ఈ స్థల యజమానితో కలసి తాను హైదరాబాదుకు రావడానికి ఎటువంటి అభ్యంతరం లేదని చెప్పి ఈ వివాదానికి తెరదించారు. ఈ విషయంలో జిల్లా మంత్రుల సహాయం తీసుకొనేందుకు తనకు ఎటు వంటి అభ్యంతరం లేదని కౌన్సిలర్ సందానిబాష చేసిన అభ్యర్థనకు ఛైర్ పర్సన్ జవాబుగా చెప్పారు. సమావేశం మొత్తం బాక్స్‌టైప్ బ్రిడ్జి సమస్య చర్చించడానికే పరిమితం కావడం పట్ల కొందరు సభ్యులు నిరసన వ్యక్తం చేయడం కనిపించింది. సమావేశం సాయంత్రం 4గంటల కని ప్రకటించడం; కాని మొదలయ్యే సరికి లేటు కావడం, చీకటి పడడం వల్ల పలువురు సభ్యులు ఇళ్లకు వెళ్లి పోతుండటం వల్ల మునిసిపల్ అజెండాలోని పలు విషయాలు మరుగున పడిపోతున్నాయి.



గాంధీ జయంతి సందర్భంగా గాంధీ విగ్రహానికి పూలమాల వేస్తున్న మునిసిపల్ ఛైర్మన్ ఆనం. వివేకానంద రెడ్డి, ప్రక్కన ఇన్‌చార్జి కమీషనర్ రామసుబ్బా రెడ్డి.

## రాశి ఎక్కువైనా వాసివున్న కథాసంకలనం

# తరుణీతరంగాలు

కాలం విచిత్రమైనది. ప్రజల అభిరుచులూ విచిత్రమైనవి. సాహిత్య ప్రక్రియలలో ఒక్కో ప్రక్రియ, ఒక్కో దశల్లో మకుటం లేని మహారాణి అవుతున్నది.

1980 నుంచి ఆధునిక కవిత్వం, స్త్రీ వాద, దళిత వాద కవిత్వం అత్యుత్సాహంగా ఉప్పెనలా విజృంభించింది. 1980 - 90 ప్రాంతాలలో వలె అంతకు ముందెన్నడూ కవిత్వం అలజడిని సృష్టించలేదు. వాద ప్రతివాదనలతో పతాక శీర్షికలతో "కవిత్వం" మకుటం లేని మహారాణి అయింది.

1990 నుంచి కథానిక ప్రక్రియ విజృంభించింది. కవిత్వంలో పెచ్చు పెరిగిపోయిన అస్పష్టత, సంక్లిష్టత, కవిత్వం పట్ల ప్రజలలో విముఖభావాన్ని కలిగించాయి. అయినప్పటికి కవులు తమ ధోరణిని మార్చుకోక పోవడంతో ప్రజలు కథను సాదరంగా ఆహ్వానించి,కవిత్వం పట్ల నిర్లక్ష్య వైఖరిని ప్రదర్శించారు. ఈ నేపథ్యంలో రాయలసీమ, తెలంగాణా కథకులు విజృంభించి విస్తృత కథాసృష్టి చేశారు.

కాలానికి విలువ కట్టి ఆధునికులు 'పెద్ద' కథలను పట్టించు కోకపోవడం వల్ల ఈ మధ్య కాలంలో "మినీకథ" రచన విపరీతంగా జరిగింది. ప్రజల [illegible] పట్టి నడపడం రచయితలు సైతం అలవర్చుకున్నారు. అంతేగాక మినీకథా సంకలనాలకు పబ్లిషర్స్ నుంచి కూడా మంచి ప్రోత్సాహం లభించింది. ఆ నేపథ్యంలో తొంగిచూసిన కథా సంకలనం శ్రీమతి

> గ్రంథసమీక్ష
> **తరుణీ తరంగాలు**
> రచయిత్రి
> శ్రీమతి దోర్నాదుల సుబ్బమ్మ
> సమీక్షకుడు
> శ్రీ పాయసం సుబ్రహ్మణ్యం
> ప్రతులకు – సరోజినీ పబ్లిసింగ్ హౌస్
> ఏలూరురోడ్, విజయవాడ
> వెల రూ.35/-

దోర్నాదుల సుబ్బమ్మ గారి "తరుణీ - తరంగాలు"

శ్రీమతి సుబ్బమ్మ ఉత్సాహం రీత్యా సాంఘిక సేవాకార్యకర్త. సమాజ స్థితిగతులను క్షుణ్ణంగా పరిశీలించే గుణం, సమాజ పరిస్థితులకు స్పందించే నైజం వుండటం వల్ల ఆవిడ రచయిత్రి కూడా అయ్యారు. కథా సంకలనంలో మొత్తం 50 కథలున్నాయి. అన్నీ మినీ కథలే. చెప్పదలచుకున్న విషయాన్ని సూటిగా, కుండ బద్దలు కొట్టినట్లు చెప్పడం ఈ రచయిత్రి నైజం.

కథా సంకలనం చదివాక రచయిత్రిలోని 'మానవ్యలనం' అర్థమయింది. సమాజ వైరుధ్యాలు, స్త్రీల దోపిడీ, స్త్రీల పీడన, స్త్రీ దౌర్బల్యం, స్త్రీల అణచివేత, ఇత్యాది ఘటనలకు రచయిత్రి విపరీతంగా స్పందించారని విస్తుంది.

కథ మొత్తాన్ని ఏదో కోణం నుంచి ప్రారంభించి పరిష్కారాన్ని పాఠకులకు వదిలేస్తూ ఆమె కథలకు ముగింపు యిచ్చిన పద్ధతి బాగుంది. కథలు రెండు, మూడు పేజీల్లో ముగియడం వల్ల పాఠకులు ఇబ్బంది పడరు. విసుగుదల ప్రదర్శించరు. ఈ కథా విధానాన్ని నేటి తెలుగు కథకులు అలవరచు కోవడం ఎంతయినా అవసరం. ఒకప్పుడు శ్రీ మల్లాది వెంకట కృష్ణమూర్తి కూడా ఈ పద్ధతినే పాటించారు. ప్రజాభిమానాన్ని పొందారు. మొత్తం కథలలో, మేలు బంతులైన కథలు పదివున్నాయి. అందులో 'మేలుకొలుపు', మారుతున్న కాలంలో మారని మగువలు, అతడు - ఆమె, 'ధనధృవం - ఋణధృవం', నువ్వయితే ఏం చేస్తావ్?, కూతురు కలిగినముత్యం, అమ్మరిటైర్‌మెంట్, జానకమ్మ నౌకరి మొదలైనవి పాఠకుల హృదయాల్ని తాకుతాయి.

'మేలుకొలుపు' కథలో 'నిర్మల' కుమార్తె 'సీత' రెండవ పెళ్ళికి

కొరవ 11 పేజీలో

# స్టాక్‌లేకనే కార్డులపై పామాయిల్ పంపిణీ!

సరుకు లేకుండానే అధికారులు ఇస్తున్న ఉత్తుత్తి ప్రకటనల వల్ల చౌకధరల డిపో డీలర్ల పంట పండుతూంది; దీని వల్లవినియోగదారులు నష్ట పోతున్నారు. ప్రజా పంపిణీ వ్యవస్థ ద్వారా సెప్టెంబరు నెల కోటాగా 446 మెట్రిక్ టన్నుల పామోలిన్ విడుదల చేసినట్లు జాయింట్ కలెక్టర్ ప్రకటించారు. మామూలుగా విడుదల చేసే కోటా కన్నా ఈసారి ఎక్కువ మొత్తం విడుదల చేయడం వల్ల టౌన్‌లోని తెల్ల కార్డుల వారు కూడా 2కిలోల పామోలిన్‌ను పొందవచ్చు అని ఆ ప్రకటనలో చెప్పారు. కాని సెప్టెంబరు 30తేది వరకు స్టాక్ పాయింట్ నుంచి ఈ కోటా విడుదల కాలేదు. పామోలిన్ కోసం డి.డి తీసుకెళ్లిన డీలర్లు పాయింట్‌లోస్టాక్ లేకపోవడం వల్ల ఉత్త చేతులతో తిరిగొచ్చారు. పామోలిన్ వచ్చేసరికి ఐదారు రోజులు పట్ట వచ్చని స్టాక్ పాయింట్ అధికారులు చెబుతున్నారు. ఈ కోటాను ఏవిధంగానైనా డీలర్లు తెచ్చు కొంటారు. సెప్టెంబరు నెల కోటా కావడం వల్ల, నామ మాత్రంగా ఒక రోజు ఇచ్చి, అక్టోబరు నెలలో పోయిన నెల మాని ఎక్కడ నుంచి ఇవ్వగలమని డీలర్లు వినియోగదార్లను దబాయించే ప్రమాదం వచ్చి పడింది. మామూలుగా డీలర్లు తమ వద్ద వుండే కార్డులను బట్టి పామోలిన్ కోటాను స్టాక్ పాయింట్ నుంచి విడుదల చేసినా, రెండు రోజులు మాత్రం ఇచ్చి స్టాక్ అయిపోయిందని చేతులెత్తేస్తున్నారు. ఈ సారి ప్రభుత్వమే స్టాక్ ఒక నెల లేటుగా మంజూరు చేయడం వల్ల మొత్తం పామోలిన్‌ను బ్లాక్ మార్కెటుకు తరలించే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. జాయింట్ కలెక్టర్ తన ప్రకటనల వరకే సరిపెట్టు కోకుండా, సెప్టెంబరు నెల కోటా పామోలిన్ సక్రమంగా వినియోగదారులకు అందేటట్లు చూడాలి. లేకుంటే లక్షలాది రూపాయల విలువ చేసే పామోలిన్‌ను డీలర్లు మ్రింగేస్తారనడంలో ఎటువంటి సందేహమూ లేదు.

## మళ్లీ జిల్లా పరిషత్ గొడవ!

కొత్తగా జరుగుతున్న ఉపాధ్యాయుల పోస్టుల భర్తీ విషయంలో జిప ఛైర్మన్‌కు, సభ్యులకు మధ్య రేగుతున్న రగడ, చిలికి చిలికి

**నెల్లూరు సంగతులు**

గాలివానగా మారేట్లుంది. కొత్త పోస్టుల భర్తీకి ఛైర్ పర్సన్ తమ అనుమతి కూడా తీసుకోవాలని అన్ని పార్టీలకు చెందిన జడ్పీటిసి సభ్యులు ఇటీవల సమావేశమై తీర్మానించారు. ఈ విషయాన్ని ఛైర్ పర్సన్ పట్టించు కోకపోతే అసలు పోస్టుల భర్తీ అధికారం లేకుండా జడ్పీ సమావేశం ఏర్పాటు చేసి ఒక తీర్మానం చేస్తామని సభ్యులు అల్టిమేటమ్ ఇచ్చారు. కాని, అల్టిమేటమ్‌ను ఛైర్ పర్సన్ డాక్టర్ నాగభూషణమ్మ పట్టించు కోవడం లేదు; ఈ విషయమై ఆమె పత్రికలకు ఒక ప్రకటన పంపారు.

విద్యాశాఖ కార్యదర్శి పంపిన ఆదేశాల ప్రకారం ఫలానా ఉపాధ్యాయుడిని ఫలానా స్కూలుకు నియమించడమనేది జిల్లా పరిషత్ ఛైర్ పర్సన్ అనుమతితో జరగాలని గుర్తు చేశారామె. కొందరు సభ్యులు ఉపాధ్యాయ కేటాయింపులో భాగ స్వామ్యం కావాలని బెదిరించి, ఏవేవో ప్రకటనలు చేస్తే, అవి ఏ విధంగా

కొరవ 10 పేజీలో

# గూడూరు గబ్బు ఎట్లా భరిస్తున్నారు బాబోయ్?

గూడూరు స్వంత ఊరు కాని వాళ్ళు ఒకసారి గూడూరు పట్టణానికి పోతే మంచి ఎండలో అయితే ఎదురుగా మనిషొస్తున్నాడా, రిక్షా వస్తుందా, యే బండొస్తుందో తెలియదు ఒక బస్సో ఒక కారో రోడ్డెంబడి పోంగానే సినిమాల్లో మనం చూస్తున్నట్లు ఇంద్రలోకంలో మేఘాలు క్రమ్మినట్లు మనం కూడా నారదులు వారి మాదిరో లేక యే దేవతో అయినట్లు మేఘాల్లో నడుస్తుంటాం; ఊపిరాడదు, కళ్ళు కనపడవు. ఒళ్ళంతా దుమ్ముతో నిండి రెండు కిలోలు బరువు పెరుగుతాం. బయటి నుండి అవూరికి వచ్చిన వారికే ఇంత అవస్థగా వుంటే అవూళ్ళోనే వుండే జనం బాధ వర్ణనాతీతం. ఏమి పాపం చేసుకొని గూడూరులో కాపురం వుంటున్నారో?

ఇక ఎండా కాలం ఇంత బాగుంటే వర్షాకాలం సంగతి మరీ దారుణం. నాలుగు చినుకులు పడితేచాలు గూడూరు పాత బస్టాండైతే కుమ్మరోళ్ళు కుండలు తయారు చేసేందుకు కాళ్ళతో త్రొక్కినట్లు బస్టాండంతా బస్సులు కుమ్మి ముద్దం చేసేసుంటాయి. నడవను వీలులేదు మోకాటిలోతు బురద బస్ దగ్గరికి పరిగెత్తి లోపల వేసుకొన్న చెప్పులు ఊడి బురదలో ఇరుక్కి పోతాయి. గుడ్డలు అంతా ఖరాబు. ఊళ్ళోని అన్ని వీధులూ తిరిగితే మచ్చుకు ఒక్క వీధైనా ఈ రొచ్చులేని వీధి లేదు. ఇప్పుడు ఐ.ఎ.ఎస్‌ల మాదిరి పాతకాలంలో ఐసిఎస్‌లు వుండేవారు. గూడూరు సబ్ కలెక్టర్ తన ఆఫీసుకు, బంగ్లాకు పోయే రోడ్డు ఒకటి వుంది. దాని పేరు ఐసిఎస్ రోడ్. పేరులో చాలా గొప్పగానే వుంది. వర్షం మొచ్చి ఆరోడ్డులో నడిస్తే తెలుస్తుంది అనుభవిస్తే నత్తా. బురద మయం కాలువను గట్టి నేలటేదు. అందుకు తగ్గట్టు మార్కెట్ కూడా - మార్కెట్ ప్రక్కనే రోడ్డు కాబట్టి చిన్న చిన్న కూరగాయల వ్యాపారస్తులు రోడ్డుకు రెండు తట్లూ ఆక్రమించుకొని వ్యాపారం. చెడిపోయిన కూరగాయలు విసిరి విసిరి రోడ్లోకే కొడుతున్నారు.

> ఒళ్లు క్రమ్మేసే ధూళి మేఘాలు
> వూబిలను తలపించే బురద మడుగులు

ఇవంతా కుళ్ళి ఎంత దుర్గంధమో భరించలేనిది. యమలోక మంటే ఇదేనేమోననిపిస్తోంది. అవూళ్ళో వుండే గౌరవనీయులైన ఉన్నతోద్యోగులకు ఒక మనవి. మేమే ఈ రొచ్చును భరించాల్నా అంటున్నారు ప్రజలు? సబ్ కలెక్టర్‌గారు, మున్సిపల్ ఛైర్మన్, కమీషనర్ తదితర ఉన్నతాధికారులంతా మీ నాల్గు చక్రాల బండ్లు దిగి ఒకసారి ఐసిఎస్ రోడ్‌లో, పాత బస్టాండ్‌లో, రాజవీధిలో హాయిగా హవాయ్ చెప్పులు వేసుకొని మంచి డ్రెస్ చేసుకొని ఒక్కసారి విహరించి ప్రజలనుభవిస్తున్న, మీరు వారికి కలుగ జేస్తున్న సౌకర్యాలను, సౌఖ్యాలను అనుభవించాల్సిందిగా మా విన్నపం. అయితే మాయీవిన్నపాన్ని మీరు ఆదరించలేరని కూడా మాకు తెలిసిన విషయమే.

## ఎక్సైజ్ సిఐ ప్రతిభ

మద్యపాన నిషేధ ఉద్యమానికి ఊపిరి పోసిన నెల్లూరు జిల్లాలో అక్రమ మద్యం అంతం చూడను తన వంతు కృషి చేస్తున్నాడు నెల్లూరు టౌన్ ఎక్సైజ్ సిఐ. తాను బాధ్యతలు స్వీకరించి నప్పటి నుండి అక్రమ మద్యం వ్యాపారులకు సింహస్వప్న మయ్యాడాయన. సెప్టెంబర్ మాసంలో దాడులు చేసి 3లక్షల రూపాయలకు పైగా అక్రమ మద్యాన్ని స్వాధీనం చేసుకొన్నాడు. స్వయంగా తానే ముందునిలబడి వాహనాలు తనిఖీ చేసే అలవాటున్న కోటేశ్వరరావు 2తేది పాండిచ్చేరి నుంచి వస్తున్న ఫియెట్ కారును ఆపి, అందులోని 97బాటిళ్లు స్వాధీనం చేసుకొని కేసుపెట్టారు. టౌన్‌లో అలవాటు ప్రకారం అక్రమ మద్యం వ్యాపారం చేస్తున్న వ్యాపారులు సిఐ వల్ల తమ దుకాణాలు మూసేశారు. కోటేశ్వరరావు కడ వరకు ఇదే ధోరణి ప్రదర్శిస్తే మంచిది.

## పొట్టెపాళెం - దారిదోపిళ్లు

పొట్టెపాళెం - నరసింహకొండ పోయే దారిలో గత పదిరోజాలుగా దోపిడీలు ఎక్కువయ్యాయి. వారం రోజుల క్రిందట ఎవరో గుర్తు తెలియని వ్యక్తులు పొట్టెపాళెం వాసి చెన్నారెడ్డి పాపయ్యను చావగొట్టి అతని వద్దమున్న 300 రూపాయలు పట్టుకెళ్లారు.



అక్కినేని జన్మదినం సందర్భంగా జరిగిన ఏకపాత్రాభినయ పోటీల్లో విజేత అసనాక దయాకర్ రెడ్డికి మెమెంటో అందజేస్తున్న బాలాజీ గ్రూప్ ఎగ్జిక్యూటివ్ పివి ప్రసన్న రెడ్డి. పోటీల నిర్వాహకుడు బాజానీ.

# పోలీసులపై పోలీసులే కేసు పెట్టారు!

చట్టాన్ని కాపాడవలసిన పోలీసులే, ఒక నిర్దోషిని దొంగగా చిత్రీకరించి చిత్రహింసలకు గురిచేయడంతో, అతడికి వైద్యం చేసిన డాక్టరు తిరిగి పోలీసులకు ఫిర్యాదు యివ్వాల్సి వచ్చింది.

కావలి పోలీసు సర్కిల్ పరిధిలో జరిగిన ఒక దొంగతనం కేసులో అనుమానంపై విచారణకు గాను, దక్కిలి మండలం మర్లగుంటకు చెందిన తెరు కృష్ణయ్యను కావలి పోలీసులు తీసుకొని వచ్చారు. అతడ్ని విచారించిన పోలీసులు అతడు నిర్దోషి అని తెల్సికూడా, పాత నేరస్థుడు అన్న కారణం చేత అతడిని నేరం అంగీకరించమని వత్తిడి చేశారు. అయినా అతను అంగీకరించక పోవడంతో కావలి పోలీసులు అతనిని బెదిరించి, వారం రోజులు గడువు ఇచ్చి పది సవర్ల బంగారం తీసుకొని రావల్సిందిగా చెప్పి పంపారు.

పాత నేరస్తుడైన కృష్ణయ్యపై అనేక కేసులు వున్నప్పటికీ అతను తన ప్రవర్తన మార్చుకొని దక్కిలి పోలీసు స్టేషన్ పరిధిలోని తన స్వగ్రామమైన మర్లగుంటలో సంవత్సరం నుంచి మగ్గం నేస్తూ జీవిస్తున్నాడు. కావలి పోలీసుల వేధింపులుభరించలేని కృష్ణయ్య గత్యంతరం లేకక్రిమిసంహారక మందు త్రాగి ఆత్మహత్యా ప్రయత్నం చేశాడు. కుటుంబ సభ్యులు వెంకటగిరి ఆస్పత్రిలో చేర్పించగా - అతనిని పరీక్షించిన ప్రభుత్వ డాక్టరుకు జరిగిన కథను చెప్పాడు. దానిపై డాక్టర్ చలించి యిచ్చిన సమాచారం మేరకు వెంకటగిరి పోలీసులు కృష్ణయ్య వద్ద వాంగ్మూలం తీసుకొని కావలి పోలీసులపై కేసు నమోదు చేశారు.

## ఎంప్లాయీస్, ఫెడరేషన్ అలయెన్సు విజయం!

కావలి ఆర్టీసి డిపోలో జరిగిన ఎన్నికల్లో ఎంప్లాయీస్ యూనియన్, స్టాఫ్ అండ్ వర్కర్స్ ఫెడరేషన్ అలయెన్స్ యూనియన్లు విజయం సాధించాయి. ప్రధాన ప్రత్యర్థి నేషనల్ మజ్దూర్ యూనియన్ కొద్ది ఓట్ల తేడాతో అపజయం పాలైంది.

డిపోలోని 535 ఓట్లలో జిల్లా స్థాయి ఓట్లను స్టాఫ్ అండ్ వర్కర్స్ ఫెడరేషనుకు వేయించుకునే విధంగా, రాష్ట్ర స్థాయి ఓట్లను ఎంప్లాయీస్ యూనియన్ వేయించుకునే విధంగా అంగీకారం కుదిరింది. రాష్ట్ర స్థాయి ఓటులో ఎంప్లాయీస్ యూనియన్‌కు 243ఓట్లు రాగా; నేషనల్ మజ్దూర్ యూనియన్‌కు 239 ఓట్లు వచ్చాయి.

# సందర్శకులకు సదుపాయాలు కరవైన సోమశిల!

సోమశిల ప్రాజెక్టు వద్ద ఉండే అధికారులు తాము మెరుగైన సదుపాయాలు అనుభవిస్తూ, సందర్శకులకు మొండి చేయి చూపుతున్నారు. సోమశిల ప్రాజెక్టును సందర్శించి ఇక్కడి ప్రకృతి రమణీయతను ఆస్వాదించాలని దూర ప్రాంతం నుంచి వచ్చే వారికి రాత్రి పూట బస చేసేందుకు కనీస వసతులు లేవు. దీనివల్ల సోమశిలను సందర్శించాలనుకునే వారి సంఖ్య రోజురోజుకూ గణనీయంగా తగ్గిపోతూంది. ప్రాజెక్టు కోసం పునాది రాయి వేసినప్పటి నుంచి సోమశిల పర్యాటకుల రాకపోకలతో రద్దీగా తయారైంది. చుట్టు ప్రక్కల గ్రామాల నుండే కాకుండా, ఇతర జిల్లాల నుంచి కూడా సోమశిల ప్రాజెక్టును చూసేందుకు వస్తుంటారు. కాని ఇక్కడ కనీస వసతులు లేకపోవడంతో నిరాశకు గురవు తున్నారు. కోట్ల రూపాయలు ఖర్చుతో అధికారులు తాము బసచేయడానికి మాత్రం అతిథి గృహాలు నిర్మించుకొని సోమశిలకు వచ్చే పర్యాటకులను పూర్తిగా విస్మరించారు. ప్రాజెక్టు సమీపంలో, ఉన్నతాధికారులకోసం ఇతర ఉద్యోగులు ఉండటానికి సకల సదుపాయాలా సమకూర్చుకున్నారు. సోమశిలలో 3 అతిథి గృహాలున్నాయి.

1975 ప్రాంతంలో సోమశిల ప్రాజెక్టుకు ప్రాథమికంగా అంచనాలను చేపడుతున్న రోజుల్లో అప్పటి ప్రధాని ఇందిరాగాంధీ ఇక్కడికి వస్తారని ఒక అతిథి గృహాన్ని నిర్మించి అందంగా ముస్తాబు చేశారు. ప్రస్తుతం దీన్ని పట్టించుకునే వారు లేక పాడుపడిన భవనంలా వుంది. ఇందులో ఉన్న రెండు గదులు ఎప్పుడూ ఖాళీగా ఉంటాయి. అధికారులు ఈ అతిథి గృహాన్ని ఖాళీగా ఉంచుతారేగాని ప్రజలకు ఇవ్వడానికి అంగీకరించరు. గతంలో ప్రాజెక్టు పనుల కోసం ఒక స్పెషల్ ఆఫీసర్‌ను నియమించారు. ఆయన కోసం, ఓ.ఎస్.డి బంగ్లా అని, ప్రత్యేకంగా ఒక అతిథి గృహాన్ని నిర్మించారు. రెండు నెలలకో, మూడు నెలలకో ఒకసారి వచ్చే చీఫ్ ఇంజనీరు, సూపరింటెండెంటు ఇంజనీరు ఇందులో బస చేస్తారు. మిగిలిన రోజుల్లో ఇదిఖాళీగానే ఉంటుంది. కేవలం ప్రాజెక్టు సంబంధితులైన అధికారుల కోసం మరో గృహాన్ని నిర్మించారు. ఇందులో రెండు సాధారణ గదులు, రెండు ఎయిర్ కండిషన్ గదులు వున్నాయి. ఈ అతిథి గృహం కూడా నెలలో చాలా రోజులు ఖాళీగానే ఉంటుంది. మామూలు రోజుల్లోవీటిని రాజకీయ నాయకులకు, గుర్తింపు కలిగిన వ్యక్తులకు, కాంట్రాక్టర్లకు ఇస్తారు తప్ప ప్రజలకు కేటాయించరు. అవి అధికారులకు తప్ప సామాన్య ప్రజానీకానికి ఉపయోగపడటం లేదు. సందర్శకులు రాత్రి పూట బస చేసేందుకు కొన్ని ఏళ్ళ కిందట పెద్దదార్ మెటరీని నిర్మించారు. అయితే తర్వాత దాన్ని సిబ్బందికి క్వార్టర్లుగా ఇచ్చేశారు. దూర ప్రాంతాల నుండి వచ్చిన పర్యాటకులు సోమశిల ప్రాజెక్టు పరిసర ప్రాంతాల్లో నెలకొని ఉన్న వాతావరణానికి ముగ్ధులవు తున్నారు కాని వుండేందుకు వసతి లేక నిరాశగా వెళ్లి పోతున్నారు. అధికారులు తగిన చర్యలు, తీసుకొని పర్యాటకులకు వసతి గృహాలు ఏర్పాటు చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ■

> జిల్లావార్తలు

# కార్టూన్ పోటీల్లో కావలి బాలిక ప్రతిభ

హిందూస్థాన్ టైమ్స్ పత్రిక ఢిల్లీలో నిర్వహించిన జాతీయ స్థాయి 10వ కార్టూన్ ఎగ్జిబిషన్ పోటీకి కావలికి చెందిన కుమారి అక్షయం సరిత వేసిన కార్టూన్లు ఎంపికయ్యాయి.

ఈ పోటీల్లో షార్జా క్రికెట్ పోటీలను పార్లమెంటును సమన్వయ పరుస్తూ కార్టూనులు వేయాలని నిర్వాహకులు సూచించారు. ఆశ్చర్యపరుస్తూ కుమారి సరిత వేసిన మూడు కార్టూన్‌లు ఈ ఎగ్జిబిషన్‌కు ఎంపికయ్యాయి. హవాలా స్కోర్ బోర్డు, ఓట్ ఈక్ సీక్రెట్ ఆఫ్ మై ఎనర్జీ అని వేసిన కార్టూన్లను న్యాయ నిర్ణేతలు అయిన కిరణ్‌బేడి, అనుపమ్‌ఖేర్, దిలీప్ పడ్గాంకర్, అబు అబ్రహాం, సుధీర్ తైలాంగ్ ఉత్తమమైనవిగా ఎంపిక చేశారు. సరిత తొలి ప్రయత్నంలోనే వేసిన కార్టూన్‌లు జాతీయ స్థాయి పోటీలకు ఎంపిక కావడం విశేషం. కావలి జవహర్ భారతి కాలేజి లెక్చరర్ శ్రీ ఎ. పాండురంగారావు ప్రోత్సాహంతో కార్టూన్లను పోటీకి పంపించినట్లు సరిత చెప్పారు. హైదరాబాదులోని "జి.టి.వి" వారు నిర్వహిస్తున్న "జెజా" ఆర్ట్స్ స్కూలులో శిక్షణ పొంది కార్టూనిస్టుగా స్థిరపడాలనే ఆకాంక్షను వ్యక్తం చేశారామె.

# శ్రీ రాజ రాజేశ్వరి అమ్మవారి దేవస్థానం

దర్గామిట్ట, నెల్లూరు - 524 003

## ఎందరో మహానుభావులు - అందరికీ కృతజ్ఞతా పూర్వక వందనాలు

గౌరవనీయ భక్తవరేణ్యులకు,

నమస్కారం!

శ్రీ రాజ రాజేశ్వరి అమ్మవారికి పుష్కర నవరాత్రోత్సవాలు జరుగనున్నాయి. ఈ పరమ పావన కార్యక్రమం ప్రారంభించి పన్నెండేళ్లయింది. మీ వంటి భక్తుల సహాయ సహకారాలతోనే ఇన్నేళ్లుగా ఈ పుణ్యకార్యం నిర్వహించ గల్గుతున్నాము. ఈ సందర్భంలో మీకు కృతజ్ఞతలు చెప్పడం నా కర్తవ్యంగా భావిస్తున్నాను.

ధర్మకర్తగా నేను పదవి స్వీకారం చేసే నాటికి అమ్మవారికి మహాత్మ్యం తప్ప ఆలయ మర్యాదలు లేవు; అసలు ఆలయానికి సంపూర్ణ రూపమే లేదు. ఆనాటి నిర్వాహకులు అమ్మవారి ఆభరణాలు తీసుకొని కన్పించకుండా పోవడంతో ధూపదీప నైవేద్యాలు సమకూర్చే బాధ్యతతో ధర్మకర్తృత్వం స్వీకరించ వలసి వచ్చింది. అప్పటి నుంచి ఇప్పటి వరకు నాకు లభించిన మహదవకాశంగా, అమ్మవారు కరుణతో అనుగ్రహించిన వరంగా భావించి నా శక్తి వంచన లేకుండా దేవాలయ అభివృద్ధికి కృషి చేశాను. మీ వంటి వదాన్య భక్తుల భూరి విరాళాలతో ఎన్నో నిర్మాణాలు చేపట్టాను. గర్భగుడికి పాలహారం నిర్మాణంతో ప్రారంభించి, అలంకార మండపం, ప్రహరీ గోడ, ముఖ మండపంలో, గర్భ గుడిలో గ్రానైట్ పలకలతో ఫ్లోరింగ్; గోడలకు పాలరాతి పలకల అమరిక; వినాయక స్వామి, సుబ్రహ్మణ్య స్వామి పూజా మందిరాల అలంకరణ, నవగ్రహ మండపంలో సిరమిక్ రాతి పలకల అమరిక, ఆవరణమంతా పాలిష్ రాళ్ల ఫ్లోరింగ్, తదితర అభివృద్ధి కార్యక్రమాలు నిర్వహించాము. అమ్మవారికి సింహ వాహనం అమర్చాము. టిక్కెట్ల కౌంటర్, మంచినీటి వసతి, క్యూ ఏర్పాట్లు, శాశ్వత విద్యుద్దీపాలంకరణ చేశాము. ప్రధాన ఆలయ అంతర్భాగంలో దశావతారాల చిత్ర శిల్పాలు నెలకొల్పాము.

ఇవికాక గాయత్రీ దేవికి ప్రత్యేకంగా మందిరం నిర్మించాము. ఆలయ ఆవరణంలో కళ్యాణ మండపం, బయట కళ్యాణ వేదిక నిర్మించడం జరిగింది. వందలాది శుభకార్యాలకు ఈ మండపాలు ఉపకరిస్తున్నాయి.

వీటన్నింటి ద్వారా అమ్మవారి ఆలయానికి ఒక సంపూర్ణ, సమగ్ర రూపం ఏర్పడింది. ఎటువంటి ఆస్తులు, ఆదాయం, చరిత్ర, మొక్కుబడుల సాంప్రదాయం లేకుండా దాదాపు 30 లక్షల వ్యయంతో ఇన్ని విధాలా ఆలయ అందానికి మెరుగులు దిద్ద గలిగామంటే అది మీ వంటి వదాన్యుల సహకార ఫలితమే. ఈ రోజు రాష్ట్రంలోనే గుర్తింపు కల్గిన దేవస్థానంగా మన అమ్మవారి ఆలయం ప్రసిద్ధి చెందింది. ఇంత స్వల్పకాలంలో ఇంత అభివృద్ధి జరిగిన ఆలయం రాష్ట్రంలో మరొకటి లేదని ప్రభుత్వాధికారులు, ఇతర జిల్లాల భక్తులు ప్రశంసిస్తున్నప్పుడల్లా ఆ అభినందనలు మీ వంటి వారికి చెందుతాయి అని భావించే వాడిని.

పన్నెండేళ్ల క్రితం ఆలయ బాధ్యత స్వీకరించి నప్పుడు అమ్మవారి రాబడి ఏడాదికి కేవలం 20 వేలు; ఇప్పుడది 17 లక్షలకు పెరిగింది; ఈ సంవత్సరం 20 లక్షల రూపాయలకు చేరబోతున్నది. ఒకే ఒక అర్చకుడు తప్ప మరో ఉద్యోగి లేని పరిస్థితి నుంచి 8 మంది అర్చకులతో, 22 మంది నిర్వహణ సిబ్బందితో ఆలయానికి ఒక సంపూర్ణత్వం ఏర్పడింది. ఈ పుష్కరకాలంలో ఏ ఒక్క రోజు, ఒక్క సందర్భంలోనూ సాంప్రదాయ, దైవకార్యాలకు, పూజా విధి విధానాలకు లోపం రానివ్వలేదు. అపవిత్రతను దరిచేర నివ్వలేదు. ఇదంతా మీ సహకార పుణ్యమే.

నవరాత్రి ఉత్సవాల నిర్వహణలో రాజరాజేశ్వరి దేవాలయ సాంప్రదాయం ఈనాడు రాష్ట్రమంతటికీ ఆదర్శప్రాయమైనదిగా గుర్తింపు పొందింది. ఇంత ఘనంగా, ఇంత భారీ . ఇందరు విఖ్యాత కళాకారుల ప్రదర్శనలతో, ఇటువంటి విద్యుద్దీపాలంకరణలతో ఉత్సవాలు నిర్వహించడం అందరి అభినందనలకూ పాత్రమౌతున్నది. అందువల్లే కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ శంకరాచార్యుల వారు తమ వసంత నవరాత్రోత్సవాలు చరిత్రలో ప్రప్రథమంగా, కంచిని దాటి, ఇక్కడ జరిపించారు. ఈ గౌరవం రాష్ట్రంలో మరే ఆలయానికి దక్కలేదు.

అమ్మవారి ఆలయానికి 1975 లోనే కుంభాభిషేకం జరిగినా, నవరాత్రోత్సవాలు ప్రారంభించింది నేను ధర్మకర్తగా నియమితుడనైన తర్వాతనే. అందువల్లే ఇవి పుష్కర ఉత్సవాలు. ఈ మహద్భాగ్యం నాకు లభించడానికి కారకురాలైన అమ్మవారికి; నన్ను ప్రోత్సహించి, నా విధ్యుక్త ధర్మం నెరవేర్చడానికి సహకరించిన మీకు ఈ సందర్భంలో నా హృదయపూర్వక కృతజ్ఞతలు సమర్పించుకొంటున్నాను. ఆలయ అభివృద్ధికి, అమ్మవారి సేవకు మీ తోడ్పాటు, చేయూత ముందు ముందు కూడా లభిస్తుందనే విశ్వాసంతో సెలవు తీసుకొంటున్నాను. దేవాలయ యజమాన్యంలో, ఉత్సవాల నిర్వహణలో దేవాదాయ శాఖ అధికారులు, సిబ్బంది; పోలీసు ఉద్యోగులు, ఎలక్ట్రీషియన్లు, కళాకారులు, మునిసిపల్ సిబ్బంది, దేవస్థాన ఉద్యోగులు, ఇంకా ఎందరెందరో ఎన్నెన్నో రూపాల సహకరించారు. వారి తోడ్పాటు లేకుంటే ఈ దేవస్థానం ఈ ప్రాభవానికి రావడం అసాధ్యం. వారందరికీ నా వినమ్ర పూర్వక కృతజ్ఞతాభి వందనాలు.

96 అక్టోబరు 13 నుంచి 21 తేది వరకు జరుగనున్న పుష్కర శరన్నవరాత్రోత్సవాలలో మీరు స్వయంగా పాల్గొని రాజరాజేశ్వరి దేవి కరుణా కటాక్ష వీక్షణాలకు పాత్రులై, తీర్థ ప్రసాదాలు స్వీకరించాలని ప్రార్థిస్తూ —

**కె.వి. రాఘవ రెడ్డి**

ఛైర్మన్, ధర్మకర్తల మండలి

# నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

### జనార్ధనరెడ్డి

మాజీ ముఖ్యమంత్రి,రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు నేదురుమల్లి జనార్ధనరెడ్డి నెల్లూరు వస్తున్నారు. 9తేది నాయుడుపేట, సాయంత్రం 5గంటలకు సైదాపురంలో వెనుకబడిన తరగతుల నాయకుడు, కాంగ్రెస్ వాది మన్నారపు సిద్ధయ్య సంతాప సభలో పాల్గొంటారు. 10తేది నెల్లూరు, 11తేది నాయుడుపేట, 12తేది వెంకటగిరి - ఇప్పటికింతే!

### రమేష్‌రెడ్డికి పుంగనూరు డ్యూటీ

ఉపఎన్నికలు జరుగుతున్న చిత్తూరు జిల్లా పుంగనూరు నియోజకవర్గానికి మార్కెటింగ్ మంత్రి టి.రమేష్‌రెడ్డిని ముఖ్యమంత్రి, ఇన్‌ఛార్జిగా నియమించారు. పెద్ద బాధ్యత నెత్తిన వచేసరికి మంత్రి 3 తేది హడావుడిగా బయలుదేరి వెళ్లారు.

### సోమశిలకు నీటి ప్రవాహం

సోమశిల ప్రాజెక్టుకు రెండు రోజులుగా నీళ్లు ఎక్కువగా వచ్చి చేరుతున్నాయి. ప్రాజెక్టు నుంచి పెన్నా నదికి ప్రస్తుతం 2,06,460 క్యూసెక్కుల నీళ్లు వదులు తున్నారు. ప్రాజెక్టుకు పై నుంచి 2,06,460 క్యూసెక్కుల నీళ్లు వచ్చి చేరుతున్నాయి. పెన్నా నది ఉపనదులన్నీ పొంగి ప్రవహిస్తుండడంతో 2తేది ప్రాజెక్టుకు చెందిన 12 క్రస్ట్ గేట్లు ఎత్తి వేశారు. ప్రస్తుతం సోమశిలలో 36 టిఎంసిల నీళ్లు నిల్వ వున్నాయి. గేట్లు ఎత్తి వేయడంతో ఆత్మకూరు మండలంలోని 13గ్రామాలు జలదిగ్బంధనలో చిక్కుక పోయాయి. ఆత్మకూరు మండలం అశ్వనీపురానికి చెందిన కొంపాల బాలకొండయ్య (50) బొగ్గేరు నుంచి ఆత్మకూరు చెరువుకు నీటిని తీసుకువెళ్లే సప్లయ్ ఛానెల్ దాటుతూ 3 తేది మరణించారు.

### ఏటికి నీళ్లు

సోమశిల గేట్లు ఎత్తి వేయడంతో ఏటికి మళ్లీ నీళ్లు వచ్చాయి. నెల్లూరు ఆనకట్టపై 8 అడుగుల నీళ్లు ప్రస్తుతం ప్రవహిస్తున్నాయి.

### హైదరాబాద్ వెళ్లొచ్చిన నెల్లూరు కౌన్సిలర్లు

విజయ మహల్ గేటు వద్ద బాక్స్‌టైప్ బ్రిడ్జికి ఏ సమయాన ముహూర్తం నిర్ణయించారో గాని, ఎప్పటి కప్పుడు పని వెనుకకు పోతుంది. బ్రిడ్జి వద్ద అప్రోచ్ రోడ్ల నిర్మాణానికి పంపిన ప్లాను హైదరాబాదులోని టౌన్ ప్లానింగ్ డైరక్టర్ కార్యాలయంలో నిలబడి పోయి ఉందట. దీన్ని కదల్చను 30 తేది నెల్లూరు మునిసిపాలిటీ నుంచి ఛైర్మన్ నాయకత్వాన ఒక బృందం హైదరాబాద్ వెళ్లి వచ్చింది. మార్కెటింగ్ మంత్రి రమేష్ రెడ్డిని తీసుకొని మునిసిపల్ మంత్రి తమ్మినేని సీతారాంను కలిసారు. మునిసిపల్ అడ్మినిస్ట్రేటివ్ డైరక్టరును కూడా రోడ్ల విషయమై నిలదీసారు. ఉప ఎన్నికల తరువాత అప్రోచ్ రోడ్ల ఫైల్ కదులు తుందని మంత్రి హామీ ఇచ్చారట. మునిసిపల్ వైస్ ఛైర్మన్ వి. దశరధ రామయ్య, కౌన్సిలర్లు రాఘవ రెడ్డి లక్ష్మయ్య, ఫయ్యాం బసవయ్య, శ్రీమన్నారాయణ, ముజాఫ్, షఫీ, రాళ్ళపల్లి సుబ్బలక్ష్మి, చెన్నారెడ్డి సరోజనమ్మ తదితరులు హైదరాబాద్ వెళ్లి వచ్చారు. సమస్యల మీద కౌన్సిలర్లు రాజధాని యాత్ర చేయడం అప్పటి వారికి కొత్త అనుభవం.

### కెపి కెనాల్‌కు నీరు

కండలేరు నుంచి మద్రాసుకు తెలుగు గంగ నీటిని మూడు రోజుల మాత్రమే వదల గలిగారు. రెండు రాష్ట్రాల సరిహద్దులో వున్న పూండి రిజర్వాయరుకు రోజుకు 500 క్యూసెక్కుల నీళ్లు అతికష్టంగా ఇస్తుండినారు. కాని కెపి కెనాల్ 120 కిమీ వద్ద లీకేజి రావడంతో ఆకస్మాత్తుగా నీటి సరఫరాను అధికారులు ఆపేశారు. కాలువల పనులన్నీ పూర్తి కాకుండానే మద్రాసుకు తొందరపడి నీళ్ళు వదలడంతో సత్యవేడు వద్ద 150 ఎకరాల పంట నీట మునిగింది. గంగ కాలువకు పూర్తిగా నీటిని వదిలితే ఎన్ని ఊళ్లు కనపడ కుండా పోతాయో?

### రికోకు ఎన్నికలు

ఆత్మకూరులోని విద్యుత్ సంస్థ రికో ఎన్నికలు 28 తేది జరుగుతాయి. 10 తేది నుంచి నామినేషన్లు స్వీకరిస్తారట. అధ్యక్ష పదవి కోసం డా. రవీంద్రనాథ్ రెడ్డి, పట్టాభిరామ రెడ్డి పోటీ పడుతున్నారు.

### సోలార్ 96 సదస్సుకు డా. జగదీష్

ఆస్ట్రేలియాలో అక్టోబర్ 22 తేది నుంచి 25 తేది వరకు జరగనున్న సోలార్ - 96 సదస్సులో పాల్గొని ప్రత్యామ్నాయ ఇంధన వనరుల రంగంలో పరిశోధన పత్రం సమర్పించను డాక్టర్ ఎ. జగదీష్ వెళ్లుతున్నారు. అంతర్జాతీయ ఖ్యాతినార్జిస్తున్న జగదీష్‌కు అభినందనాలు.

### మన్నారపు సిద్ధయ్య మరణం

వెనుకబడిన తరగతుల నాయకుడు, కాంగ్రెస్ వాది, ముప్పై సంవత్సరాలుగా సైదాపురం సర్పంచ్‌గా వుండిన మన్నారపు సిద్ధయ్య మరణించారు. వారి కుటుంబానికి మా సానుభూతి.

**సానుభూతి**

నెల్లూరులో సీనియర్ ఆడిటర్,
మా గురువు
సోలా బాలసుబ్రహ్మణ్యంగారు
3తేది స్వర్గస్థులైనారు.
వారికి దైవసన్నిధిలో చిరశాంతి
కలగాలని ప్రార్థిస్తూ,
వారి కుటుంబానికి నా సానుభూతి.

నర్వేపల్లి జగన్నాధరావు
సేల్స్‌టాక్స్ ప్రాక్టీషనర్

# కండ్లేరు కట్టలు, సోమశిల కాలువ కూలిపోయేట్లున్నాయి!

దీనికి బాధ్యులు? ఎక్కడ జరిగింది తప్పిదం? ఎవరు చెప్తారు దీనికి సమాధానం? ఎవరు పూడుస్తారు జరిగిన నష్టం? క్రమంగా కాలంచేసి గాల్లో పెట్టేసి మర్చిపోయే ఏలినవారి దర్పమ్మే వంటి గుడ్డి ప్రభుత్వం డ్యాం కట్టి, నీళ్లు నిలవేయు దానికి భూసేకరణ జరపక పోవడమే దీనికి కారణం; గత అరవయ్యేళ్లుగా నెల్లూరు జనం ఓట్లతో గద్దెనెక్కి, పదవుల సుఖం అనుభవించిన ప్రతి రాజకీయ వాది దీనికి బాధ్యులే; కానీ వారెవ్వరూ దీనికి సమాధానం చెప్పరు!

డ్యాం నిర్మాణం పూర్తయి మూడేళ్లయ్యింది. ఆఫీసులతో సహా అక్కడి నుంచి ఎత్తేశారు; ఇంజనీర్లూ వెళ్లి పోయారు. కాని భూసేకరణ విషయం మాత్రం అటు కాంగ్రెస్, ఇటు తెలుగు దేశం ప్రభుత్వాలు పట్టించు కోవడం లేదు. కడప జిల్లాలో 17 గ్రామాలకు చెందిన భూమిని స్వాధీనం చేసుకోవలసి వుంది. ఆలస్యమయ్యే కొద్దీ ఖర్చు పెరిగి పోతూంది. భూబకాసురులు కొందరు తయారై రైతుల నుంచి చవకగా భూములు కొని, లెక్కకు మించి గుడిసెలు వేసి, ఉత్తుత్తి బావులు త్రవ్వి, అవంతా తమ నివాసాలని అధికార్లను దబాయించి కోట్లు కాజేయాలని చూస్తున్నారు. గ్రామాలలో అయితే ఎకరాకు వంద నూటయాభై 'కబ్జా' వెలిసి వున్నాయట. వాటన్నింటికీ నష్టపరిహారం చెల్లించాలంటే ఎన్ని కోట్లయినా చాలవు. 1976లో ప్రాజెక్టు నిర్మాణం ప్రారంభమయ్యే సమయంలో భూసేకరణకు వేసిన అంచనా 10 కోట్లు లోపు; 1987లో ఎన్టి రామారావు అధికారంలో వున్నప్పుడు 27 కోట్లు ఇస్తే భూసేకరణ పూర్తవుతుందని స్వర్గీయ నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి అన్నారు; అప్పటి నుంచి చచ్చిపోయే వరకు ఆయనా కోరిక కోరుతూనే వుండేవారు. కాని ఒక్క ముఖ్యమంత్రి పట్టించు కోలేదు. ఫలితం – ఈ రోజు వంద కోట్ల వరకు వెచ్చిస్తే కాని భూసేకరణ పూర్తికాదు.

భూసేకరణ పూర్తయితే సోమశిల డ్యాంలో 72 టిఎంసిల నీరు నిల్వ చేయవచ్చు. కానీ ఇప్పుడందులో కేవలం 37 టిఎంసిలే నిల్వ చేసి తతిమావి క్రిందకు వదిలేస్తున్నారు. ఇప్పటి వరకు అట్లా 70 టిఎంసిల నీరు వృధా చేశారు; ఇవి తొలకరి వానలకు జూన్ నుంచి సెప్టెంబరు వరకు వచ్చిన నీరు. ఇప్పుడు మళ్లీ వరద వచ్చింది. అక్టోబరు, నవంబరు నెలలు మనకు వర్షాకాలం కాబట్టి, ఇంకా వస్తుంది కూడా! అది మరొక 70 లేక 80 టిఎంసిలు వుంటుంది. వాటినీ వృధాగా వదిలేయ వలసిందే. నిల్వ చేసుకొనే వసతి లేదు. ఇప్పటి వరకు వదిలేసినవి, ఇక ముందు వృధా చేయబో తున్నవి కలిసి లెక్క వేసి, ఉత్పత్తి నష్టం అంచనా కడితే – 1500 కోట్ల రూపాయల పంటను కోల్పోయినట్లు తేలుతుంది.

సోమశిలే కాదు – కండ్లేరు పరిస్థితి అంతే! అక్కడ భూసేకరణ దాదాపు పూర్తయ్యింది; రిజర్వాయర్ కట్టల నిర్మాణం పూర్తయింది; కాలువ త్రవ్వకం జరిగింది. కానీ నీరు నిలిపేందుకు వీలు కావడం లేదు. ఇది కేవలం ఇంజనీర్ల అవినీతి ఫలితం; కాంట్రాక్టర్ల నుంచి పర్సంటేజీలు, కమీషన్లు బొక్కడం; వాటితో బొజ్జలు పెంచుకోవడమే తమ విధ్యుక్త ధర్మంగా భావించే నీచులు ఇంజనీర్లుగా, అధికారులుగా పెత్తనం చేస్తుండడంతో ఈ దుర్మార్గాలు జరిగి పోతున్నాయి.

సోమశిల నుంచి దిగువకు వృధాగా వదిలే నీటిని తెలుగు గంగ కాలువ ద్వారా కండ్లేరు రిజర్వాయర్‌కు పంపి వుంచవచ్చు. కాని అందుకు అధికారులు సాహసించ లేకపోయారు. అందుకు కారణాలు రెండు; మొదటిది – సోమశిల డ్యాం నుంచి నీరు వదిలితే – ఆ కాలువ కొట్టుకు పోయేట్లుంది. డ్యాంకు దక్షిణంగా తెలుగు గంగ కోసం త్రవ్విన కాలువ ఇది. కొండను తొలచి,


సోమశిల

(మొదటి పేజీ కొరవ)


కాంక్రీట్ లైనింగ్ చేసి మరీ కాలువ ఏర్పాటు చేశారు. కానీ అందులో కాంక్రీటుకు బదులు ఇసుక – మట్టి కల్పినట్లున్నారు; నీళ్లు వదలడమే ఆలస్యం – ఆ లైనింగ్ బలహీన పడింది. ఏకమై ప్రక్క కట్టను కన్సాలిడేట్ చేయడంలో అవినీతి ఫలితంగా కట్టనుంచి ధారలు ధారలుగా నీరు బయటకు వచ్చేస్తున్నది. రెండు నెలల క్రితం ప్రయోగాత్మకంగా డ్యాం దగ్గర ఒకే [illegible] గేటు తెరచి కొద్ది నీరు వదిలారు ఇందులో! దానికే కాలువ లీక్ అయ్యి, కాలువ ప్రక్కన వున్న తిరుపాలు రెడ్డి ఆశ్రమంలో మోకాటి లోతు నీళ్లు నిల్చాయి. కుల్లూరు దగ్గర రాజుపాళెం గ్రామం జలమయ మైంది. కాలువ పొడవునా, పొలాలు నీట మునిగి పోయాయి.

ఒకే ఒక గేటు తెరిస్తేనే ఈ పరిస్థితి అంటే – ఇక ఆ తూముకున్న మొత్తం మూడు గేట్లూ తెరిస్తే పరిస్థితి ఏమిటి? ఈ తూము – సైఫన్ తరహాలో నిర్మించిందట. గేట్లు తెరువగానే డ్యాంలోని నీరు జలపాతం వలె ఉరికి, కాలువ క్రింద అంచు తాకి, ఒక్క ఉదుటున పైకెగిరి, డ్యాంలోని నీటి మట్టం స్థాయిలో కాలువలో ప్రవహించాలి. అదీ డిజైన్. అంత నీటి ఉధృతి వస్తే ఈ కాలువ నిలుస్తుందనే గ్యారంటీ కన్పించడం లేదు. అక్కడున్న ఆశ్రమం పూర్తిగా మునిగి పోవడం ఖాయమంటున్నారు. క్రింద వుండే గ్రామాలకూ ప్రమాదమే. ఆ దృశ్యం ఊహించుకొని, భయపడి పోయి, గేట్లు ఎత్తడం మానేశారు ఇంజనీర్లు.

ఇక్కడ వీరు గేట్లు ఎత్తి, కాలువకు నీరు వదలి ఇది పోరిటా (?) – కండ్లేరు కట్టలు ఆ ఒత్తిడికి తట్టుకొంటాయో లేదోనని భయం ఇంకొక ప్రశ్న పీడిస్తున్నది. రాష్ట్రంలోనే అత్యంత ఎత్తయిన మట్టి కట్టల రిజర్వాయర్ ఇది. సోమశిల కంటే పెద్దది; 78 టిఎంసిల వరకు నీరు నిల్వ చేయవచ్చు. సాధారణంగా రిజర్వాయర్లను, డ్యాంలను రెండు కొండల మధ్య కడతారు. కండ్లేరు దగ్గర ఆ వసతి లేకపోవడంతో – మట్టితో కట్టలు నిర్మించారు. అందులో కొంత భాగం సుద్దమట్టి. ఎక్స్‌కవేటర్‌తో త్రవ్వి పోసినప్పుడు బండలు, బండలుగా పడింది. డిజైన్ ప్రకారం ప్రతి అరుగుకూ ఒకసారి రోలర్ త్రిప్పి, నీళ్లు చల్లి కట్టను కన్సాలిడేట్ చేయాలి. అది కాంట్రాక్టర్ల కొస్తే సరిగా చేస్తారో లేదోనని, ఇంజనీర్లకు అప్పచెప్పారట. కాంట్రాక్టర్లు గొర్రెలు తినేవారైతే – ఇంజనీర్లు బర్రెలను తినేవారు కదా! వారు రోలర్ త్రిప్పినట్లు లెక్కలు వ్రాసుకొని, ఆ డీసల్ డబ్బు మిగుల్చుకొని జేబులో వేసుకున్నారు. ఫలితంగా – నీరు పెట్టగానే మట్టికట్టల మధ్య సందులు ఏర్పడి, రిజర్వాయర్‌లోని నీరు ధారాపాతంగా బయటకు వచ్చేస్తున్నాయి. రిజర్వాయర్‌లో పూర్తి సామర్థ్యం నీరు పెడితే – కట్టకు గండ్లు పడిపోతాయని భయపడు తున్నారు. అందువల్ల సోమశిల డ్యాం నుంచి వృధాగా నీరు సముద్రానికి వదిలేస్తున్నారే తప్ప – కండ్లేరు నింపడానికి ఆలోచన చేయడం లేదు. ఒకటి లేదా రెండు వానాకాలం సీజన్లు గడిస్తే – కట్టలు వాటంతట అవి కుదుట పడతాయని; అప్పుడు కొద్ది కొద్దిగా నీరు పెంచుకొంటూ వెళ్తే, రిజర్వాయర్‌ను కాపాడు కోవచ్చునని అధికార్ల అంచనా అట. ఆ లెక్క ప్రకారం కనీసం మరొక రెండేళ్లపాటు కండ్లేరు నిరుపయోగంగా పడివుండాలన్న మాట. ఎంత అన్యాయం?

ఈ పరిస్థితికి అధికారులు చెప్పే కుంటి సాకు – కండ్లేరు హెడ్ రెగ్యులేటర్ నిర్మాణం ఇంకా పూర్తి కాలేదని; అందువల్ల నీరు నింపలేక పోతున్నామని చెప్తున్నారు. అంత పెద్ద రిజర్వాయర్ కట్టినవారు ఆ తూము ఎందుకు నిర్మించ లేకపోయారో? ఎందుకు ఆలస్యమైంది? ఆ కాంట్రాక్టర్‌పై ఏ చర్య తీసుకున్నారు?

చర్య సంగతి దేముడెరుగు – ఆలస్యం చేసినందుకు ఆ కాంట్రాక్టర్‌కు 3 కోట్ల 56 లక్షలు అదనపు బిలు చెల్లించారు. ఆ పని మొత్తం విలువ 17 కోట్ల చిల్లర; అంటే 20 శాతం అదనంగా ఇచ్చారన్న మాట. కండ్లేరు నింపక పోవడానికి ఈ తూము నిర్మాణమే కారణమైతే – దానివల్ల జరిగిన పంట నష్టం 780 కోట్ల రూపాయలు – ఇది మొత్తం తెలుగు గంగ పథకం పెట్టుబడితో సమానం. 78 టిఎంసిల నీరు నిల్వ చేసి వుంటే - 7 లక్షల 80 వేల ఎకరాలకు సాగునీరందించి వుండేది. కండ్లేటి క్రింద అంత ఆయకట్టు లేదు కాబట్టి, రానున్న ఐదారేళ్ళు వానలు కురవక పోయినా, కరువు ఏర్పడినా సైర్లకు నీటి సమస్య వుండేది కాదు.

ఇంజనీర్లు, కాంట్రాక్టర్లు కలిసి జిల్లా ప్రజలకు చేసిన ద్రోహం ఎటువంటిదో ఆలోచించండి!

పెన్న విచిత్రమైన నది. సరాసరిన ఇరవయ్యేళ్లకు ఒకసారి కాని, దానికి వరద రాదు. కృష్ణ, కావేరి, తుంగభద్ర వంటి నదులకు సగటున రెండు నుంచి మూడేళ్లకు ఒకసారి వరదలు వస్తాయి. కానీ పెన్న పరిస్థితి అది కాదు. నెల్లూరు రైతుల అదృష్టం కొద్దీ ఈ ఏడాది అటువంటి వరద వచ్చింది. కాని ఆ అదృష్టాన్ని, దౌర్భాగ్యంగా మార్చి పారేశారు – మన నాయకులు, ఇంజనీర్లు. అంత నీటినీ వృధా చేశారు.

ఈ పరిస్థితి తలచుకొంటే కడుపు మండి పోతున్నది. వీరందరినీ ఒక మూటలో కట్టి, సోమశిల డ్యాం వరద గేట్ల నుంచి పరవళ్లు త్రొక్కుతున్న నీటిలో ముంచాలన్పిస్తున్నది. కాని, మనమేమి చేయలేము. జరిగిన నష్టానికి మౌనంగా రోదించడం తప్ప; శాపనార్థాలు పెడుతూ రచ్చబండల వద్ద చర్చలు జరపడం తప్ప రైతులు ఏమి చేయగలరు? ఆ శాపాలు తగిలి, ఆ పాపం చేసినవారు కష్టాలు పడడానికి ఇదేమీ పురాణ కాలం కాదు కదా!

## . తెలుగు గంగ

12 పేజీ తరువాయి

కేటాయించారు. అయితే కావేరి ఆయకట్టు ప్రాంత రైతులు ఈ పథకాన్ని వ్యతిరేకించడంతో తిరిగి ఎంజిఆర్ కృష్ణా నీటి పథకం వైపు మొగ్గు చూపారు. శ్రీ భవనం వెంకట్రామ్ ముఖ్యమంత్రిగా వున్నప్పుడు మంత్రిగా వున్న నేను తమిళనాడుకు విద్యుచ్ఛక్తి ఇచ్చే విషయంగా మద్రాసుకు వెళ్లడం జరిగింది. ఆ రాష్ట్ర నీటి పారుదల శాఖకు అప్పుడు కార్యదర్శిగా వుండిన ఆంధ్రుడు శ్రీ శర్మ నన్ను కలిసి మద్రాసు ప్రభుత్వం కృష్ణ నీటి మళ్లింపు పథకానికి ఆమోదం తెలిపిందని, ఈ విషయమై ఆంధ్ర ప్రదేశ్, మద్రాసు రాష్ట్రాల మధ్య త్వరగా ఒక ఒప్పందం జరిగితే బాగుంటుందని నాకు సూచించారు. ఆ విషయాన్ని మన ముఖ్యమంత్రికి నివేదించి వెంటనే చర్య తీసుకోవాలని కోరాను. అయితే ఈ లోగా భవనం స్థానంలో శ్రీ విజయ భాస్కర రెడ్డి ముఖ్యమంత్రి అయ్యారు. మద్రాసు నగర నీటి సమస్య తీవ్రరూపం దాల్చింది. ఇటు ఆంధ్ర ప్రదేశ్‌లోను, అటు తమిళనాడులోనూ శాసన సభ ఎన్నికలు దగ్గర పడ్డాయి. మద్రాసు నగర నీటి సమస్యను తీర్చడానికి అప్పట్లో కేంద్రంలో మంత్రిగా వున్న శ్రీ ఆర్. వెంకట్రామన్ (మాజీ రాష్ట్రపతి) కృష్ణ నీటిని రైల్వే ట్యాంకర్ల ద్వారా విజయవాడ నుంచి మద్రాసుకు తీసుకు వెళ్లి ఆ నీటి పంపిణీకి మద్రాసులో ఒక పెద్ద సభ ఏర్పాటు చేశారు. ఆ సభకు మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ ఎంజిఆర్‌ను ఆహ్వానించ లేదు. దీనికి బాధపడిన ఎంజిఆర్ మద్రాసుకు కృష్ణ నీటిని మళ్లించే పథకానికి ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రిని ఒప్పించమని నన్ను కోరారు. శ్రీ విజయ భాస్కర రెడ్డికి నేను ఆ విషయాన్ని చెప్పగా ఆయన రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ టిఎన్ రామన్‌ను మద్రాసుకు పంపించి ఆ రాష్ట్ర అధికారులతో చర్చించమని ఆదేశించారు. రెండు రాష్ట్రాల మధ్య కుదిరిన ఒప్పంద ముసాయిదాపై సంతకం చేయడానికి మద్రాసుకు వెళ్లడానికి శ్రీ విజయ భాస్కర రెడ్డి అంగీకరించారు. అప్పుడు ఎన్‌టిఆర్ తన పార్టీ ప్రచారం కోసం చైతన్య రథమెక్కి రాష్ట్రంలో తిరుగు తుండినారు. ఆ పర్యటన మధ్యలో ఈ విషయం తెలిసి రాయలసీమ ప్రజలు త్రాగునీటికి, సాగునీటికి అలమటిస్తుంటే మద్రాసు నగరానికి కృష్ణా జలాల్ని ఎవరబ్బ సొత్తుగా ఇస్తారని ఆవేశంగా ప్రశ్నించారు. ఆ మాటను పత్రికలు పెద్దక్షరాలలో ప్రచురించాయి. మద్రాసుకు నీరివ్వడానికి గతంలోనే ఒప్పందం కుదిరిందని ఎవరో పత్రికల వారంటే ఆ ఒప్పందాన్ని నేను అధికారంలోకి రాగానే రద్దు చేస్తాననన్నారు ఎన్‌టిఆర్. మన నీటిని ఆ రాష్ట్రానికి ఇవ్వటానికి వీల్లేదని వాదించా రాయన. శాసన సభ ఎన్నికల ప్రకటన అప్పటికే వచ్చినందు వల్ల ఆ ఒప్పందంపై సంతకాలు చేస్తే ఎన్నికల నియమావళిని ఉల్లంఘించి నట్లవుతుందని శ్రీ విజయ భాస్కర రెడ్డి సంతకాల కార్యక్రమాన్ని వాయిదా వేశారు. ఆ ఎన్నికల్లో ఆంధ్ర ప్రదేశ్‌లో అధికారాన్ని చేజిక్కించుకున్న శ్రీ ఎన్‌టిఆర్ మాట మార్చి అనేక సంవత్సరాలు మద్రాసు గాలి పీల్చాను, అక్కడి నీళ్లు తాగాను, వారి అన్నం తిన్నాను, అందుకు ప్రతిగా వారికి గుక్కెడు నీళ్లిచ్చి తమిళ సోదరుల రుణం తీర్చుకుంటాను" అని కవిత్వం పల్లించి తమిళ తంబితో సంతకాల కార్యక్రమాన్ని పెట్టించు కున్నారు. ఆనాటి కార్యక్రమానికి అప్పటి ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ హాజరై ఆంధ్ర ప్రదేశ్, మహారాష్ట్ర, కర్ణాటక రాష్ట్రాల ఉదార స్వభావాన్ని కొనియాడారు. ఎంజిఆర్ 30 కోట్ల రూపాయల చెక్కును ఎన్‌టిఆర్‌కు అందించారు. అయితే ఆ డబ్బును ఎన్‌టిఆర్ ప్రభుత్వం ఇతర కార్యక్రమాలకు మళ్లించటంతో తమిళనాడు రాష్ట్రం చాలా సంవత్సరాల వరకు తెలుగు గంగ పథకం నిర్మాణానికి తన వంతు వాటాను నిలిపి వేసింది. తామిచ్చిన డబ్బుకు లెక్కలు చెప్పేదాకా తిరిగి డబ్బు ఇచ్చేది లేదని తేల్చి చెప్పింది. 1983లో తెలుగు గంగ పథకం ప్రారంభమై నపుడు మూడేళ్లలో పూర్తి చేస్తామన్న ఎన్‌టిఆర్ ఏడేళ్లపాటు అధికారంలో కొనసాగి కూడా తెలుగు గంగ పనుల్ని మూడోవంతు కూడా పూర్తి చేయలేదు. ఏ ఒక్క సంవత్సరంలో కూడా ఆ పథకానికి బడ్జెట్‌లో కేటాయించిన నిధులు పూర్తిగా ఖర్చు పెట్టలేదు. 700 కోట్ల రూపాయలతో పూర్తయ్యే పథకాన్ని 2000 కోట్ల రూపాయలు అయ్యేలా చేసింది తెలుగు దేశం ప్రభుత్వమే. 1983 నుంచి 1989 వరకు ఈ పథకానికి తెలుగు దేశం ప్రభుత్వం పెట్టిన ఖర్చు తమిళనాడు వాటాతో సహా కేవలం 329 కోట్లు మాత్రమే. తిరిగి రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోనికి వచ్చాక 1989 నుండి 1994 వరకు ఈ పథకానికి ప్రాధాన్యత ఇచ్చి 561 కోట్లు ఖర్చు చేయడం జరిగింది.

1991లో నేను ముఖ్య మంత్రిగా వున్నప్పుడు, అప్పటి తమిళనాడు గవర్నర్ శ్రీ పిసి అలెగ్జాండర్ నాతో ఈ విషయం ప్రస్తావించారు. ఆయన నేను చదువుకొనే రోజుల్లో వివిఆర్ కాలేజి లెక్చరర్‌గా వుండేవారు. అందువల్ల ఆయనంటే నాకు చాలా గౌరవం. తెలుగు గంగ కాలువ అలైన్‌మెంట్ మార్చి, దొడ్డిదారిన నీళ్లివ్వమని నన్ను అడిగారు. కాని నేనందుకు అంగీకరించ లేదు. రాయలసీమ అవసరాలు తీర్చనిదే మద్రాసుకు నీళ్లివ్వడం కుదరదని చెప్పాను.

చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రి కాగానే – అనాడు అలెగ్జాండర్ అడిగిన దొడ్డిదారిన అవలంబించి మద్రాసుకు నీరు ఇచ్చేస్తున్నారు. రాయల సీమ, నెల్లూరు జిల్లాలకు తీరని అన్యాయం చేసి, తెలుగు గంగ పథకం ప్రతిపాదనలు ప్రక్కన పెట్టి – బ్రహ్మంగారి మఠం, వెలుగోడు రిజర్వాయర్‌లను బైపాస్ చేసి – శ్రీశైలం రిజర్వాయర్ నుంచి బనకచర్ల ఎస్కేప్ ఛానల్ ద్వారా నిప్పులవాగు, కుందూ నదుల్లోకి నీరు మళ్లించి వాటిని ఆదినిమ్మాయపల్లి వద్ద పెన్నకు చేర్చి మద్రాసుకు నీటిని తరలించే ప్రయత్నం చేస్తున్నారు. కేవలం తన ప్రచారం కోసం, మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కరుణానిధి మెహర్బాని కోసం, మద్రాసు పట్టణ కార్పొరేషన్ ఎన్నికల కోసం, రాయలసీమ, నెల్లూరు ప్రయోజనాలన్నీ తుంగలో తొక్కారు చంద్ర బాబు. శ్రీ కరుణానిధి కుమారుడు స్టాలిన్ మద్రాసు మేయర్ పదవికి పోటీ చేస్తున్నాడన్న విషయం ఇక్కడ గమనార్హం.

ఇదీ మద్రాసు నగరానికి కృష్ణ నీటి మళ్లింపు చరిత్ర. దీనికి తెలుగు గంగ అని నామకరణం చేయడం తప్ప తెలుగు దేశం పార్టీకి ఈ పథకంతో ఏ విధమైన సంబంధం లేదు. పునాదిరాయి, ప్రారంభోత్సవ ఫలకాలు ఆవిష్కరించే అదృష్టం వారికి దక్కింది; అంతే! ఆనాటి ప్రధాని ఇందిరమ్మ, ఆనాటి మూడు రాష్ట్రాల కాంగ్రెస్ ముఖ్యమంత్రులు చొరవ తీసుకొని, నీటి సరఫరాకు అంగీకరించ కుండా వుంటె ఈ పథకం సాధ్యమయ్యేదే కాదు.

ఈ ప్రాజెక్టు విషయంలో నడిచిన చరిత్రను వక్రీకరించ డానికి వీరు ప్రయత్నిస్తున్నారు. ఇటువంటి జాతీయ దృక్పథంతో కూడిన ప్రాజెక్టులు తలపెట్టి, రాష్ట్రాల మధ్య ఏర్పడే సమస్యలను పరిష్కరించే శక్తి సామర్థ్యాలు జాతీయ పార్టీ అయిన కాంగ్రెస్‌కు తప్ప, ప్రాంతీయ పార్టీలకు వుండవు. అది వాస్తవం!

### హెచ్చరిక నోటీసు

నా క్లయింట్ నెల్లూరు టౌన్ కాపువీధి కాపురస్తుడైన నెల్లూరు లక్ష్మి నరసింహారెడ్డి ఇచ్చిన సంజాయిషీ మేరకు యావన్మందికి తెలియజేయడం మేమనగా నెల్లూరు అపోలో హాస్పిటల్ అప్రోచ్ రోడ్డుకు తూర్పున అనుకొని యున్న వెలూరు బిట్-II గ్రామ సర్వే నెం. 904/2లో 3సెంట్ల ఖాళీ స్థలమునకు నా క్లయింట్ సర్వహక్కులు కలిగి అనుభవించు కొంటూయున్నారు. సదరు 3సెంట్ల స్థలమునకు తూర్పున అనుకొని యున్న యండ్ల పాట్లను రామరాజు అను వ్యక్తి విక్రయించు చున్నట్లుగా తెలిసినది. పై 3సెంట్ల స్థలముపై అపోలో హాస్పిటల్ యాజమాన్యమునకు గాని, రామరాజుకు గాని, మరెవరికిగాని యేలాంటి హక్కు భుక్తములు లేవు. వారు జరిపే లావాదేవీలు నా క్లయింటును బద్ధగించజాలవు.

తేది: 30-9-96 మలిరెడ్డి .యస్ అడ్వకేటు

### జనవాణీ

3వ పేజీ తరువాయి

చంద్రశేఖర్ రెడ్డి వంటి పెద్దలు ఇటువంటి సలహాలు ఇవ్వడం తగదు.

నెల్లూరు ఎస్. కిరణ్మయి

### పీవిని తెలుగు ప్రజలు క్షమించరు

తెలుగుతల్లి ముద్దు బిడ్డగా పివి నరసింహా రావు ప్రధాని పీఠం అధిష్ఠించి నప్పుడు ఆనంద పడని ఆంధ్రుడు లేడు. పలు టిమ్మిక్కులు, కుంభకోణాల్లో మునిగి తేలి తన పదవీ కాలాన్ని పూర్తి చేసుకొన్నారాయన. ఈ ఐదేళ్లలో స్వరాష్ట్రానికి ఒక్క మంచి పని కూడా చేసి పెట్ట లేదాయన. కుటుంబ సభ్యులను అధికారిక విషయాలకు దూరంగా పెడతాడని ఆయనకు పేరుండేది; కాని వెలుగు చూస్తున్న ఎన్నో కుంభ కోణాలలో ఆయన కుటుంబ సభ్యులు భాగస్వాములైనట్లు రుజువౌతున్నది. ఒక మాజీ ప్రధానిపై ఛీటింగ్ కేసు నమోదు కావడం కంటె అవమానం లేదు. కాంగ్రెస్ పార్టీ పార్లమెంటరీ నాయకత్వాన్ని ప్రధాని గొడుకు బూచిగా చూపి కొన్ని కేసుల నుండి తప్పించు కోవచ్చు. కాని తెలుగు ఖ్యాతిని దిగజార్చిన వ్యక్తిగా ప్రజలు పివి నరసింహా రావును క్షమించరు.

నెల్లూరు గునుపాటి వేణుగోపాల్

## మాటలతో ఆట - 24

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | | 2 | 3 | 4 | | 5 | 6 | | 7 | 8 |
| 9 | | 10 | | 11 | | | | 12 | 13 | | |
| | 14 | | | | | | 15 | | | 16 | |
| 17 | | 18 | | | | 19 | | | 20 | | 21 |
| 22 | 23 | | | | 24 | | | 25 | | | |
| | | | 26 | | | | 27 | | 28 | 29 | |
| 30 | | 31 | | | | 32 | | | 33 | | |
| 34 | 35 | | | 36 | 37 | | | | 38 | | |
| | | | 39 | | | | 40 | 41 | | | 42 |
| 43 | | 44 | | | | 45 | | 46 | | | |
| 47 | 48 | | | | 49 | | 50 | | | 51 | |
| 52 | | | | 53 | | | | | 54 | | |

**అడ్డం:**

2. అరవ భాష తారుమారు (3)
5. పాస్‌పోర్టుతో పాటు ఇదికూడా ఉంటేనే విదేశీయాత్ర (2)
7. జడ (2)
9. కామం (3)
11. రచనకాడు మొలతాడు (3)
12. పూరిల్లు (2)
14. పాటు పురం చెస్; పులితోమొదలు (5)
15. శ్రీనాథుడు చివరిదశలో చెప్పిన పద్యాలు (4)
18. "నగ"కు అక్షరం చేర్చు; కొండ(3)
19. తెరవాటుకు తెరతీసేయ్ (2)
20. పినాసి వాడు (3)
22. మకరంలో మిక్కిలి (3)
24. దానమిచ్చేవాడు (2)
27. దమ్మిడి అల్లములో ఏరుకో (4)
31. నేత్రం కాదు; చిత్రం (2)
32. 'జర'జను పొడిగిస్తే వ్యభిచారి (2)
33. విరామం లేని పనివల్ల మనసుకు కలిగే అలసట (3)
34. భండర (3)
36. స్త్రీ (2)
38. నవ్వు (2)
39. రైకకు అక్షరం చేర్చు; రావణుడి తల్లి (3)
40. జననీ అంటె తల్లి; భార్య కావాలంటె -అక్షరం తియ్యాలి(2)
44. ఆ బయలులో వెతకండి; కంటె పాపలున్నాయి (3)
46. చెక్కు కాకుండ బ్యాంకులో టిన్ని తీసి కూడ డబ్బు పంపవచ్చు (2)
47. రాసిది కోసతుంచి కొంచెం మార్చినా అదే అర్థం (2)
49. దట్టమైన అడవి (4)
51. స్త్రీల వాస్త భూషణం (2)
52. మంటకు అక్షరం చేర్చితే దావది (3)
53. తెలు కాదు శుభం (2)
54. సుగ్రీవుడి అన్న (2)

**నిలువు:**

1. తలలో పుట్టేది (3)
3. రథము - వికృతి (4)
4. వంగడము ప్రకృతి (3)
6. ఏ పాటు లేకపోయినా -తప్పదు (3)
8. రాజుగారి భార్య తిరగబడింది (2)
10. పులికి రెండక్షరాలు మేసితే జసుక (4)
13. కవిని బహువచనం చేస్తే పాలాన్ని టీకాకివ్వటం (3)
15. మాట కాదు; దాటించి చెప్పడం (2)
16. పినాసి స్త్రీలుప్తము శాస్త్రతుంచు (2)
17. పెద్దగా అరవడం (2)
19. కమ్మరాళ్ళ చేసేది (2)
21. కటినం తుంచితే నడుము (2)
23. గుట్టు - చేసెయ్య (2)
24. మార్గం (2)
25. రమ్ముకాదు; ఒక రకం పేకాట (2)
26. కన్ను (2)
27. ధర, ఫణి, నిజ 4అక్షరాలు ఏరుకో; సీతమ్మ తల్లి దర్శనమిస్తుంది (4)
28. నల్లని తారుమారు (3)
29. ముఖం కనపడకుండ కప్పుకొనేది (3)
30. బేల్దారి పనిముట్టు (2)
31. వేగూరులో సిలచిని కలవండి (2)
35. కుడుములు; కు ము తీస్తే పడిపోవడం (2)
36. లేఖలు వికృతి (3)
37. పొయ్యిమీది పాత్రలకు అంటేది (2)
39. బోలను కాక హిమాలయాల్లోని మరొక కనుమ (3)
41. పొదవు. వర్టికల్ (3)
42. వాడుక రీతో మొదలు (3)
43. "ఆరా"కు అక్షరం చేర్చు; పూరోటు(3)
45. పిచు (2)
48. పేజి (2)
49. జగ (2)
50. టిక్కెట్టు ఇచ్చిన అర్హతతో బాటు జాగ్రత్త కోసం నామినేషన్ చేసే వాడు (2)
51. వాయువు (2)

### మాటలతో ఆట - 22 సమాధానాలు

అడ్డం: 1.అలక 3.ముఖం 4.అరక 6.ఉల్లం 7.చపల 9.పత్త 10.వర 12.అక్క 13.గవ్వ 15.రక్కసి 17.రమ 18.తపల 20.కణం 21.రాగి 23.నంది 25.ముప 27.గాంధ్రా 29.పక్షి 30.తాజా 31.మరి 33.బిల్లం 34.పేగు 35.పల్లవము 37.పాకము 39.టిర 40.టవలు 42.వేకువ 43.వాడు 45.టుచి 46.వెంప 47.వల 48. పాటవం 50.పాము 51.విదు 52.పంచవటి నిలువు: 1.అల్లం 2.కవ 3.ముల 4.అత్త 5.కవి 6.ఉగ్గం 8.పగ 9.పచ్చ 11.రత్త 12.అక్క 13.గమనం 14.కవము 15.రణం 16.సిరా 19.లవణం 20.కల్ల 22.గచ్చు 24.దివం 26.అక్షి 28.ప్రాచి 29.పల్లం 30.తాగు 31.మల్ల 32.రవట 33.బొట్టు 34.పేము 35.పద 36.మువలు 37.పాకు 38.కవనము 39.టిరు 41.లవి 42.వేకువ 44.విటపం 46.వెంచు 49.వంచ

సరైన సమాధానాలు పంపినవారు: బండి రాఘవేంద్రరావు, ఆత్మకూరు; జి.వాణి, కొక్కుపాడు; గునుపాటి భోగీశ్వరం, కోట; చివుకుల లలితకుమారి, సికింద్రాబాదు; పసుమర్తి రామమోహనం, నెల్లూరు; వాస్తు రామచంద్ర, నెల్లూరు; వాస్తు రఘుకుమారి, నెల్లూరు; విజేత: బండి రాఘవేంద్రరావు

# మాటతప్పిన వాళ్ళను దూరంగా ఉంచుతాను!

సినిమా నటన కంటే అధిక కాలం సంఘసేవలో గడుపు తున్న నటి రేవతి "అతితప్పిన వాళ్ళను నేను దూరంగా ఉంచుతాను." అంటూ ఒక విషయాన్ని చెప్పింది. "ఇటీవల మద్రాసులో అనాథ బాలల సహాయార్థం నా ఆధ్వర్యంలో ఒక స్టార్ నైట్ వేడుక జరిగింది. ఎవరెవరికి రావడానికి వీలవుతుందో అడిగి తెలుసుకుని, వాళ్ళందరి పేర్లు పత్రికలలో వేయించాను. అందరూ వచ్చారుగాని,

## రోజా, మీనాలపై రేవతి రుసరుసలు

ఇద్దరుద్దరు ముఖం చాటేశారు. వాళ్ళకోసం కాసేపు ఎదురు చూశాం కూడా! హాజరవడానికి వీలు పడనప్పుడు ఆ సంగతి ఫోన్ చేసి చెప్పొచ్చుకదా! తోటి తారను ఇలా ఇబ్బంది పెట్టడం న్యాయమేనా అని వాపోయారామె. ఆ ఇద్దరు ఎవరో తెలుసా? రోజా, మీనా, అంది రేవతి.

## ఇదేం పేరండీ బాబూ!

"అల్లత్తె అల్లత్తె" తమిళ చిత్రాన్ని ఇ.వి.వి. సత్యనారాయణ దర్శకత్వంలో తెలుగులో "వీడెవడండీ బాబూ!" పేరుతో నిర్మిస్తున్నారు. మోహన్ బాబు, శిల్పాశెట్టి, కోట శ్రీనివాసరావు, బ్రహ్మానందం, ఎ.వి.యస్, తనికెళ్ళ భరణి, శ్రీహరి, చలపతిరావు, అశోక్‌కుమార్, ఐరన్ లెగ్ శాస్త్రి, జీవా, పార్వతి పాత్రధారులు. మాటలు. శ్రీరమణ. సంగీతం: శిర్పి.

## "ఆమె ప్రతీకారం"

"తనపై అత్యాచారం చేసిన వారిపై ఒక అబల ప్రతీకారాన్ని తీర్చుకోవడం సరికొత్త రీతిలో చిత్రీకరించబడిన 'అవతార పురుషన్', అనే తమిళ చిత్రాన్ని 'ఆమె ప్రతీకారం'గా తెలుగులో డబ్ చేస్తున్నాం; 'ఆమె' చిత్రంతో తెలుగు ప్రేక్షకులకు పరిచయమైన ఊహా ఇందులో నాయిక. ఆనంద్, రంజిత్, విజయ్, కవిత పాత్రధారులు" అన్నారు నిర్మాత బి. మధుసూదన రెడ్డి. మాటలు, పాటలు: భారతీబాబు. సంగీతం: శిర్పి. దర్శకత్వం: పాండ్యన్.

## అక్టోబర్‌లో విడుదలయ్యే చిత్రాలు

"జాబిలమ్మ పెళ్ళి" అక్టోబర్ 2న; "చిన్ని పెళ్ళారుకా" అక్టోబర్ 2న "లాఠీ ఛార్జి" అక్టోబర్ 3న, "అక్కడ అమ్మాయి - ఇక్కడ అబ్బాయి" అక్టోబర్ 10న, "రెండు కుటుంబాల కథ" అక్టోబర్ 10న, "కళ్యాణ ప్రాప్తిరస్తు" అక్టోబర్ 17న, "ఆరాంగి" అక్టోబర్ 18న, "పవిత్ర బంధం" అక్టోబర్ 18న విడుదల చేయడానికి సన్నాహాలు జరుగుతున్నాయి.

## 'మాతల్లి గంగమ్మ"

శ్రీ కృష్ణ పోతునీడు దర్శకత్వం వహించే పై చిత్రంలో సీత, ప్రియాంక, రాజ్‌కుమార్, బాబూ మోహన్, వినోద్, రమణమూర్తి, గుండు హనుమంతరావు నటిస్తున్నారు. మాటలు: కర్పూరపు ఆంజనేయులు. సంగీతం: రాజ్.

## అర్జున్ హీరోగా పి.ఎస్. రామచంద్రరావు చిత్రం

వెల్లూరియుడు పి.ఎస్. రామచంద్రరావు దర్శకత్వం వహించబోయే కొత్త చిత్రంలో అర్జున్ సరసన సౌందర్య నాయిక.

## శ్రీ చిత్ర క్రియేషన్స్

బాలకృష్ణ హీరోగా పినిశెట్టి రవిరాజా దర్శకత్వంలో అనంటి గోపినాథ్ నిర్మించే చిత్రం డిసెంబర్‌లో సెట్స్‌కు వెళ్తుంది.

## "అన్నమయ్య"

నిర్మాత వి. దొరస్వామిరాజు ప్రైవేట్‌గా భావించి "అన్నమయ్య" చిత్రాన్ని నిర్మించడానికి పూనుకొన్నారు. సెప్టెంబరు 19న చిత్రీకరణ మొదలైంది. నాగార్జున, మోహన్‌బాబు, సుమన్, రోజా, ఉమ్మకృష్ణ, భానుప్రియ, కస్తూరి, శ్రీకన్య, కోట శ్రీనివాసరావు, బాలయ్య, సుత్తివేలు, బ్రహ్మానందం, భరణి, ఎ.వి.ఎస్, గుండు హనుమంతరావు, మల్లికార్జునరావు, శుభ, శివపార్వతి పాత్రధారులు. కథ, మాటలు: జె.కె.భారవి. సంగీతం: ఎం.ఎం. కీరవాణి. దర్శకత్వం: కె. రాఘవేంద్రరావు.

## థిల్లానా ప్రారంభం

కృష్ణతో ఎ.బి.కె. మోహన్ నిర్మిస్తున్న థిల్లానా షూటింగ్ అన్నపూర్ణా స్టూడియోస్‌లో ప్రారంభమైంది. కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం జగన్.

# స్మిత మరణం ఒక మిస్టరీ!

తన స్వగృహంలో సిల్క్ స్మిత ఉరి వేసుకొని మరణించినట్లు సెప్టెంబర్ 23ఉదయం కనుగొన్నారు. ఆమెకు పదిహేనేళ్ళుగా మగదిక్కుగా ఉంటూ వచ్చిన డాక్టర్ రాధాకృష్ణన్ వెంటనే ఆమె శరీరాన్ని విజయా హాస్పిటల్‌కు తరలించారు; ఆమె అర్ధరాత్రి రెండు - నాలుగు గంటల మధ్య మరణించినట్లు ధృవీకరించ బడింది. రాధాకృష్ణన్ మొదటి భార్య కొడుకు రుద్ర చాలా కాలంగా సిల్క్ స్మిత ఇంట్లోనే పెరుగుతోంది. అసలు స్మిత శవాన్ని వేలాడటం చూసి భయపడి తన తండ్రికి తెలియ జేసింది దుర్గ. పోస్ట్ మార్టమ్ రిపోర్టులో స్మిత కడుపులో 20మిల్లీ మీటర్ల నీరు, అరటి పండు, చూయింగ్ గమ్‌లు ఉన్నట్లు తేలింది. గొంతు చుట్టూ కమిలి పోయి, లోపలి థైరాయిడ్ గ్లాండ్స్ బయటకు వచ్చినట్లు పేర్కొన బడింది. అంతకు ముందు రోజు రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో రేలంగి నరసింహారావు దర్శకత్వం వహించే ఒక కన్నడ చిత్ర నిర్మాత తన చిత్రంలో స్మిత నృత్యం చేయడానికి పదివేల రూపాయలు అడ్వాన్స్‌గా ఇవ్వడానికి వస్తే, ఆమెకు ఒంట్లో బాగోలేదని, నీరసంగా మేడమీద గదిలో పడుకొని ఉందని చెప్పి, ఆ మొత్తాన్ని రాధాకృష్ణనే పుచ్చుకున్నారు. అనుష్ప్రతను ఆప్తుల్లైన మనసుతో ఉన్నారట. శవం దగ్గర దొరికిన ఓ ఉత్తరంలో తనకు అతి సన్నిహిత అభ్యంతరులు ఎక్కువైనందు వల్ల తనువు చాలించడానికి నిశ్చయించినట్లు స్మిత రాసి ఉంది. కాని, ఆమె తల్లి "పది రోజుల క్రితం తన వాళ్ళందర్నీ ఒక సారి చూడాలని ఉందని విజయలక్ష్మి (స్మిత) ఉత్తరం వ్రాస్తే, ఏలూరుకు మద్రాసుకు బయలుదేరి వచ్చా; అమ్మాయి మామూలుగానే గడిపించింది. డబ్బు ఇబ్బంది గురించి ఒక్కమాటైనా చెప్పలేదు. రెండు రోజులుండి మా ఊరికి వెళ్లిపోయాను. ఇంతలో ఈ ఘోరం జరిగి పోయింది. అమ్మాయి ఆత్మహత్య చేసుకుందంటే నమ్మలేక పోతున్నాను." అంటూ కంటతడి పెట్టుకుంది.

దాదాపు పదిహేనేళ్ళుగా వివిధ భాషా చిత్రాలలో తన శృంగార నృత్యాలతో ప్రేక్షకులను అలరించిన స్మిత మృతికి సినిమా రంగంలో సానుభూతి చూపేవారే కరువయ్యారు. స్మిత అభిమానుల మంటూ కొందరు అలగా జనం ఆమె ఇంటి ముందు ధర్నా లాంటివి చేయాలను కున్నారే గాని, పోలీసులు కనిపించగానే తలో దిక్కు

కొరవ 11 పేజీలో

*తల్లిదండ్రుల విడాకులతో అనాధలైన పిల్లల దీనగాథకు అద్దం పట్టిన చిత్రం*

# అమ్మా నాన్న కావాలి!

**చిత్రసమీక్ష**

☆

గ్రిద్దలూరు గోపాలరావు

"అమ్మా నాన్న కావాలి" అని ఆరేళ్ల అమ్మాయి తన అమ్మను కోరుతుంది. అదే విధంగా 'నాన్నా అమ్మ కావాలి" అని ఏడేళ్ళ అబ్బాయి తన నాన్నను వేడుతాడు. ఆ అమ్మాయి, ఆ అబ్బాయి ఒకే తల్లి దండ్రుల బిడ్డలు. అయినా అమ్మాయి నాన్నకు, అబ్బాయి అమ్మకు దూరంగా ఉంటారు. దీనికి కారణం ఆ భార్య, భర్తలు పెళ్ళి చూపులరోజు చేసుకొన్న బాసలను, పెళ్ళినాటి ప్రమాణాలను విస్మరిస్తారు. మానవత్వం మరచిపోతారు. అపోహలకు, ఆరోపణలకు, అనుమానాలకు మనసులో స్థానమిస్తారు. అభిరుచులు మార్చు కుంటారు. వాగ్వాదాలు తెంచు కుంటారు. విడాకులు పుచ్చు కుంటారు. వేరు వేరు కాపురాలు పెట్టుకుంటారు. తల్లికి పుట్టిన నొప్పులు రాకముందే నాన్న విడిపోవటంతో అమ్మాయికి తన నాన్న ఎవరో తెలియదు. తల్లి పురుడు పోసుకొని తనను పుడమి మీదపడ వేసిన తర్వాత తల్లి దూరం కావటంతో అపసివాడికి తన తల్లి ఎవరో తెలియదు. అమ్మాయి, అబ్బాయి, తల్లి దండ్రుల ప్రేమలో ఒక భాగాన్నే పొందుతారు. అమ్మాయి నాన్న ప్రేమకు తపిస్తుంది. అబ్బాయి తల్లి ఆప్యాయతకు ఆరాట పడుతాడు.

చట్టం విడాకులు మంజూరు చేసి భార్యా భర్తలను విడదీస్తుంది. కాని విడిపోయిన వారిని కలిపేందుకు ఏ చట్టమూ లేదు. న్యాయాలయం వారిని మళ్ళీ కలప లేకపోయినా విడాకులు పుచ్చుకొన్న వారి హృదయాలయాలు వారిని మళ్ళీ కలపగలవు.

భార్యా భర్తలు విడాకులు పొంది విడిపోవటం వల్ల వారి బిడ్డలు మానసిక వ్యథకు గురవు తున్నారు. అనాథలవు తున్నారు. లోకవిమర్శకు గురవు తున్నారు. అందువల్ల భార్య భర్తలు ఎన్ని మనస్పర్థలను ఎదుర్కొన్నా విడాకులు పుచ్చుకోకూడదు. బలమైన పరిస్థితుల ప్రభావంతో విడిపోయినా తమ హృదయాలయాలను విస్తరించి మళ్ళీ ఒకటి కావాలి, ఈ అంశాల మీద సాయిప్రకాష్ కథ వ్రాసి, దర్శకత్వం వహించి "అమ్మా, నాన్న కావాలి" చిత్రం రూపొందించాడు.

కథ కొత్త పోకడలో సాగుతుంది. రాము (ఆనంద్) ఒక కంపెనీలో గుమస్తాగా పనిచేస్తూ వచ్చే రెండు వేల జీతంతో కాపురం గడపడం కష్టమని బ్రహ్మచారిగా కాలం గడుపు తుంటాడు. పెళ్ళి అవసరాన్ని కళ్ళకు కట్టినట్లు వర్ణించి అతని మిత్రుడు బ్రహ్మ (బ్రహ్మానందం) సీతతో (ఊహ) పెళ్ళి జరిపిస్తాడు. ఒకరినొకరు అర్థం చేసుకొని దాంపత్య జీవితం సాగించాలని, పొదుపరి తనంతో సంసారం సాగించాలని ఇద్దరూ పెళిసాడు

కొరవ 11 పేజీలో

# వినీత వింత అనుభవం

కొందరు చిన్న విషయాన్ని కూడాఎంతో ఆసక్తి గొల్పేలా వివరించి చెప్తారు. అసలు విషయమే ఎంతో ఆసక్తి గొల్పేది అయితే అటువంటి వారు ఇంకా ఎంత రసవత్తరంగా చెప్పగలరోనన్న సంగతి నటి వినీత వింత అనుభవం వింటే తెలుస్తుంది. " హైదరాబాద్‌లో షూటింగ్‌కు ట్రెయిన్‌లో ఎ.సి కంపార్టుమెంట్‌లో బయలు దేరాను. గూడూరు దాటిన తర్వాత ఒక మనిషి పెరిగిన గడ్డం, మలినమైన దుస్తులతో నా దగ్గరికి వచ్చారు. అతను టిక్కెట్ కొన్నాడో - లేదో గాని నాదగ్గర ఆటోగ్రాఫ్ తీసుకున్నాడు. "థ్యాంక్స్" చెప్తూ ఒక పది పైసలివ్వండి," అన్నాడు. ఆశ్చర్యపోతూ ఒక ఇరవై అయిదు పైసల నాణాన్ని ఇచ్చాను. దాన్ని కళ్ళకు అద్దుకొని, జేబులో వేసుకుని వెళ్ళి ఒక సీటులో కూర్చున్నాడు; సగం రాత్రి తర్వాత నాకు మెలకువ వస్తే చూశాను. అటేపులో పడుకొని ఉన్నాడతడు. పిచ్చివాడేమో అనుకున్నాను" కాని, హైదరాబాద్‌లో అతన్ని మళ్లీ చూసిన నాకే పిచ్చి పట్టినంత పనైంది. ఒక రోజు అక్కడ బిర్లా టెంపుల్‌కు వెళ్తే, నేల మీద కూర్చొని బిచ్చ మడుక్కుంటున్నాడు ఆ మనిషి. "నువ్వు ముష్టివాడివా! ఫస్ట్‌క్లాస్ ఎ.సిలో ప్రయాణం చేశావే?" అని అడక్కుండా ఉండలేక పోయాను. "మేడమ్! ఇంకో అయిదేళ్ళ వరకు నేను బిచ్చగాడినే. నాకు కేరళలో రబ్బరు ఫ్యాక్టరీ వుంది. దాదాపు వంద మంది పని చేస్తుంటారు. ఏడాది క్రితం మా అమ్మకు పెద్ద జబ్బు చేసింది. ఎందరో డాక్టర్లకు చూపించాను. ఎన్ని రకాల వైద్యాలు చేసినా ఆమెలో స్వస్థత చేకూరక పోయేసరికి ఒక మహానీయుడి సలహా మేరకు మా అమ్మకు ఆరోగ్యం చేకూరి మామూలు మనిషైతే అయిదేళ్ళ పాటు సన్యాసినై తిరుగుతా." అని

కొరవ 11 పేజీలో

# రాయి-తురాయి

## * 'మొల్ల' కవితా సౌరభం

తెలుగు రామాయణాల్లో కవయిత్రి మొల్ల రామాయణం విశిష్టమైంది. ఆమె మన నెల్లూరు జిల్లా నివాసి; పూర్తిపేరు ఆత్మకూరి మొల్ల!

ఈ 'మొల్ల' అనేది ఆమె కలం పేరేమోనని నా అనుమానం. పూల జాతులలో మొల్ల కొక విశిష్టత ఉంది; పువ్వు తెల్లనిది - చిన్నది; పరిమళం మాత్రం మరే మొగ్గకూ లేనంత గొప్పది.

ఆమె పేరు లాగే మొల్ల కవిత్వం కూడ మొల్లే; కవితా సౌరభం వెదజల్లుతూ - పాఠకులకు హృదయోల్లాసాన్ని కలిగిస్తూ ఉంటుంది.

కుహనా రసజ్ఞుల కొలువు

అగ్నిమిత్ర

కూటాల్లో తనెకు చోటు లేకపోవడం -ఒక రకంగా ఆమె చేసుకొన్న పుణ్యమే. గుణాన్ని తొక్కిపెట్టి, కులాన్ని బట్టి, హోదాను బట్టి లేని ప్రజ్ఞను ఆపాదించి, రోషాలను కప్పిపుచ్చి, మొగం మొత్తే ముఖస్తుతులతో ముంచెత్తే 'సాహిత్య విదూషకుల' దృష్టిలో మొల్ల మెదలక పోవడం వాళ్ల సంస్కార స్థాయికి నిదర్శనం; మొల్ల చేసుకొన్న సుకృతం.

పాత్రచిత్రణలోనేకాక, సన్నివేశ కల్పనలోను, అసాధారణమైన భావుకతలోను, వర్ణనా వైదుష్యం లోను మొల్ల ప్రజ్ఞ ప్రశంసనీయం.

ఔచిత్య విచారం చేసిన క్షేమేంద్రుడు వర్ణనలో కూడా ఔచిత్యం తప్పనిసరి అంటారు. వర్ణన - వర్ణన కోసం కాదు. దానికొక ప్రయోజనం ఉండాలి. పూర్వోత్తర కథా గమనాన్ని అనుసంధించాలి. వర్ణనలో భవిష్యత్ కథా సూచన గర్భితం అయి ఉండాలి.

కవయిత్రి మొల్ల వర్ణనలలో భావసౌందర్యంతో ఔచిత్యం ముడిపడి ఉండటం గమనించ దగ్గ విశేషం.

దశరథుడు శ్రీరామ పట్టాభిషేకాన్ని - వశిష్ఠాదులతో సంప్రదించి, ముహూర్తం నిర్ణయించి - ప్రకటిస్తారు.

ఆరోజుకు సభ చాలిస్తారు. అప్పుడు మొల్ల చేసిన రమ్యమైన సూర్యాస్తమయ వర్ణన చూడండి-

పగలు ప్రాగ్భాగమున నుండి గగన వీథి-
చరమ దిక్కున కేగగా శ్రమము దోచి-
చెమట పట్టిన, స్నానంబు చేయనరుగు-
కరణి అపరాబ్ధిలో విభాకరుడు గ్రుంకె!

చిన్న తేటగీతిలో తేటతేట మాటలతో సూర్యాస్తమయాన్ని చూపెడుతుంది. సూర్యుడు పగలు తూర్పు నుండి పడమటి దిక్కునకు నడిచాడు. అలసట - దానివల్ల చెమట; పట్టిన చెమటను పోగొట్టుకోవడానికి పడమటి సముద్రంలో మునిగాడట. ఈ పద్యం సహజ - ఉత్ప్రేక్షాలంకారాల సమ్మిశ్రమం. నడక - శ్రమ - చెమట. స్నానం. సహజ పరిణామాలు; విడుమ్మండలంలో చరించే సూర్యభగవానుడే అపరాబ్ధిలో మునగడం ఉత్ప్రేక్ష. కడు ఇంపైన భావ సౌందర్యం

ఈవర్ణనలో శ్రీరామ పట్టభంగ సూచన కూడా ఉంది.

అయితే ఈ పద్యాన్ని - విపద్యాన్ని అయినా సరే - శాస్త్ర దృష్టితో చూడటం రసజ్ఞత అనిపించుకోదు. కల్పనా శిల్ప మండితమై కమనీయంగా తోచేది కవిత్వం. శాస్త్రజ్ఞుడు సత్యాన్ని దర్శిస్తాడు. తాను చూచిన సత్యవస్తువును యధాతథంగా విడమరచి చెబుతాడు. అవసరమనిపిస్తే దాన్ని సూత్రీకరణం చేస్తాడు; అది పారిభాషికాల భారంతో చదువరులకు శిరోవేదన పుట్టిస్తుంది.

కళాస్రష్ట దృష్టి దీనికి భిన్నంగా ఉంటుంది. అతడు సత్య వస్తువులో ఉండే సౌందర్యాన్ని వీక్షిస్తాడు; ఒక్కొక్కసారి సత్య పదార్థంలో లేని అందాన్ని తాను కల్పించి భావ బంధురంగా, రస నిర్భరంగా ఆవిష్కరిస్తాడు.

తాను అనుభవించిన రసానందాన్ని గుణగ్రహణ పారీణులూ, రసజ్ఞులూ అయిన చదువరులకు పంచుతాడు.

సూర్యుడు చరించడం లేదు. భూ భ్రమణం వల్ల రవి చలన భ్రాంతి మనకు కలుగుతున్నదన్న సత్యం మొల్లకు తెలియనిది కాదు. కాని ఆమెది కళాదృష్టి; కళాసృష్టి; తార్కికమైన తలపోతలు, హేతుత్వబుద్ధి ఇక్కడ అక్కరకు రాని చుట్టాలు; గ్రక్కున విడువదగినవి. పరిపక్వమైన మానసిక సంస్కారం, కవి హృదయ చాలనాలకు ప్రతి స్పందించగల పరిశుద్ధమైన హృదయం ఉంటే తప్ప కవిత్వాన్ని ఆస్వాదించడం, ఆనందించడం సాధ్య మయ్యేపని కాదు.

మొల్ల రామాయణంలో ఇటువంటి మొల్లలు కోకొల్లలు - ఆఘ్రాణించే ముక్కు ఆరోగ్యంగా ఉంటే!

## 50 ఏళ్లక్రితం

3వ పేజీ తరువాయి

శాంతి గల్గుగాక! వారి కుటుంబానికి మా సానుభూతిని తెలుపుతున్నాము.

## నెల్లూరు ముచ్చట్లు

### అగ్గిపెట్టెలు

ఈవారంలో అగ్గిపెట్టెల కరువు విస్తారంగా ఉంది. ఎచ్చట చూసినా అగ్గిపెట్టెల భజనే!

27తేది వాకాటి రంగయ్య అనే వర్తకుడు పైడిపాటి వెంగయ్యకు అగ్గిపెట్టె అణాన్నరకు యిస్తానన్నాడని రిపోర్టు చేయగా, పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరు 29 అగ్గిపెట్టెలు పట్టుకున్నారు.

అదే తేది గునుపాటి కనకమ్మను వడ్లపూడి వెంకట కృష్ణయ్య అగ్గిపెట్టె అడిగితే ఒకటిన్నర అణా తీసుకొని ఇచ్చిందట. సర్కిల్ ఇన్‌స్పెక్టరు సోదా చేయగా అమ్మగారి కడుపులో 133 అగ్గిపెట్టెలు దొరికినవి.

### తులసీ రామాయణం

మొదటి తేది నుండి టౌనుహాలులో అభినవసూత నేముల అప్పారావు గారు తులసీ రామాయణం వినిపిస్తున్నారు. 9వ తేది సీతాకల్యాణం వైభవంగా జరుగుతుంది.

### యు.బి.యస్. మేనేజరు

వీరి డిక్షనరీలో డిస్మిస్‌లు, సస్పెండ్లు తప్ప వేరే పదాలు లేవా ఏమిటి?

# నెల్లూరు సంగతులు

4 పేజీ తరువాయి

వెల్లడాయుంటున్నారామె. ఇప్పటికే కొందరు ఎమ్మెల్యేలు, జిల్లా సభ్యులు కొన్ని బదిలీల ప్రతిపాదనలు తన దగ్గర ఇచ్చి ఉన్నట్లు నాగభూషణమ్మ చెప్పారు. పోస్టింగుల ఫైలును సీఈఓ అంత వరకు తనకు పంపకుండా తొక్కిపెట్టి, అనవసరంగా రాజకీయాల్లోకి తల దూరుస్తున్నట్లు ఆరోపించారామె. పోస్టింగు విషయమై నాగభూషణమ్మ ఇప్పటికే కొందరి వద్ద డబ్బు తీసుకొన్నారని ఇంకొక ప్రశ్న, సభ్యులు ఆరోపిస్తున్నారు. గతంలో టీచర్ల బదిలీలలో నాగభూషణమ్మపై తీవ్రమైన ఆరోపణలు వచ్చాయి. వాటికి ఆమె సరైన వివరణ ఇవ్వక పోవడం వల్ల, స్వంత పార్టీ సభ్యులే జడ్పీ సమావేశాల్లో ఆమెకు వ్యతిరేకంగా మాట్లాడడం ప్రారంభించారు. ఛైర్ పర్సన్‌కు, సభ్యులకు మధ్య జరుగుతున్న గొడవ ఏ స్థాయికి వెళ్లుతుందో ఇప్పుడే చెప్పలేము.

## డబ్బుతో ఆనందం రాదు

భగవద్గీత సారాన్ని పరిపూర్ణంగా తెలుసు కొంటే సందేహాలన్నీ నివృత్తి అవుతాయని నెల్లూరు కొండాయపాళెం గేటు వద్ద కృష్ణ మందిర వ్యవస్థాపకులు స్వామీజీ డాక్టర్ సుఖదేవ్ అన్నారు. అంతర్జాతీయ కృష్ణచైతన్య సంఘం ఆధ్వర్యంలో 29తేది ఏనుగు సుందరరామిరెడ్డి రోటరీ ఆడిటోరియంలో జరిగిన అంతర్ కళాశాల వక్తృత్వ పోటీలకు ముఖ్య అతిథిగా హాజరై మాట్లాడారాయన. ఆధ్యాత్మిక చింతన అంటే అన్ని పనులూ వదలుకొని కూర్చోవడం కాదని, సద్గుణాలతో, సౌశీల్యంతో ఆత్మసాక్షాత్కారం పొందడ మన్నారాయన. డబ్బుతో ఆనందాన్ని పొందడం మంటే, ఎండమావిలో దాహం తీర్చుకోవడమని స్వామీజీ అభివర్ణించారు. 'ఆధ్యాత్మిక విజ్ఞానం లోపించిన ఆధునిక విద్యా విధానం అసంపూర్ణం' అనే అంశంపై తెలుగులో, 'ఎకనమిక్ డెవలప్‌మెంట్ ఈజ్ కీ టు హ్యూమన్ హేపీనెస్' అనే అంశాలపైన ఇంగ్లీషులో వక్తృత్వ పోటీ కొనసాగింది. జిల్లా నలుమూలల నుండి పలువురు విద్యార్థులు ఈ పోటీలో పాల్గొన్నారు. ఈ పోటీల్లో తెలుగు విభాగంలో ఎన్.భాస్కరరావు, కె.వి.ఎన్.మల్లిక, ఎన్.భారతి వరుసగా మూడు బహుమతులు గెలుచుకొన్నారు. ఇంగ్లీషు విభాగంలో డి.వరలక్ష్మి, సుమిత్ర, జె.కె.స్వప్న ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలు పొందారు. విద్యార్థులను జట్లుగా విభజించి ఈ పోటీలు విడిగా నిర్వహించారు. సభకు రొటేరియన్ వొమ్మిన సుబ్రహ్మణ్యం అధ్యక్షత వహించగా, కృష్ణ చైతన్య సంఘం నెల్లూరు బాధ్యుడు పెరుగు రామకృష్ణ వేదికపై ఆసీనులయ్యారు.

## జయప్రకాష్ నారాయణ జయంతి సభ

లోక్ నాయక్ జయప్రకాష్ నారాయణ 95వ జయంతి సభ అక్టోబర్ 11తేది టౌన్‌హాల్‌లో జరుగుతుంది. ఇటీవలే ఐఎఎస్ అధికారిగా రాజీనామా చేసిన డాక్టర్ ఎన్.జయప్రకాష్ నారాయణ ఈసారి ప్రధాన వక్త; నెల్లూరు పీపుల్స్ పాలీ క్లినిక్ ఇన్‌ఛార్జి డాక్టర్ బిట్ర శేషారెడ్డి అధ్యక్షిస్తారని నిర్వాహకుడు తుంగా పాండురంగారెడ్డి తెలియ జేస్తున్నారు.

## స్టేషన్‌లో సూచికల బోర్డుల ఏర్పాటు

నెల్లూరు జిల్లా రైల్వే యూజర్స్ అసోసియేషన్ రైల్వే ప్రయాణీకులకు వివిధ సూచనలు తెలియ జేసే రెండు బోర్డులను రైల్వే ప్లాట్ ఫారంపై ఏర్పాటు చేసింది. 29తేది స్టేషన్ ఇన్‌ఛార్జి మేనేజర్ జి.ప్రభాకరరావు తన చేతుల మీదుగా వీటిని ప్రారంభించారు. రైల్వే యూజర్స్ అసోసియేషన్ అధ్యక్షుడు అన్నమూరి వెంకటేశ్వరరావు మాట్లాడుతూ రైల్వే ప్రయాణీకులకు ఎంతో అవసరమైన 15 సూచనలు ఈ బోర్డులపై వ్రాసినట్లు పేర్కొన్నారు. వీటని స్టేషన్‌లో రెండవ, మూడవ ప్లాట్ ఫారాలపై పెడతారట. ఈ బోర్డులను రోటరీ ప్రెసిడెంటు కె.బాలసుబ్రహ్మణ్యం, పాస్ట్ ప్రెసిడెంట్ డి.భరత్‌కుమార్‌రెడ్డి విరాళంగా ఇచ్చారు. ఈ కార్యక్రమంలో అసోసియేషన్ కార్యదర్శి జె.వి.కె. బాబు కూడా పాల్గొన్నారు.

## ప్రభుత్వోద్యోగుల సంఘం ఎన్నికలు

నెల్లూరు జిల్లా ప్రభుత్వోద్యోగుల సహకార పరపతి సంఘం లిమిటెడ్ నెల్లూరు, పాలక వర్గ ఎన్నికలు 13 తేది జరుగుతాయి. వి.ఆర్. హై స్కూలులో జరిగే ఎన్నికలకు కో ఆపరేటివ్ సబ్ రిజిస్ట్రార్ కె.వి. నాగేశ్వరరావును ఎన్నికల అధికారిగా కలెక్టర్ నియమించారు. 4తేది నామినేషన్లు స్వీకరిస్తారు. 5తేది ఉప సంహరణ గడువుగా నిర్ణయించినట్లు ఎన్నికల అధికారి తెలియ జేస్తున్నారు.

## లయన్స్ వైద్య శిబిరం

నెల్లూరు లయన్స్, సేవాప్రియ క్లబ్బులు సంయుక్తంగా 29తేది రంగనాయకుల పేట వి.ఎం.ఆర్ హైస్కూలులో ఒక ఉచిత వైద్య శిబిరాన్ని నిర్వహించాయి. శిబిరంలో డాక్టర్లు ఎం.ఎస్.రెడ్డి, సత్యనాథ్, సాయినాథ్, మెహబుల్లా, శ్రీమతి అరుణకుమారి పాల్గొన్నారు. 250మంది రోగులను పరీక్షించి మందులు పంచి పెట్టారు. ఈ కార్యక్రమంలో లయన్స్ క్లబ్ అధ్యక్షులు ఎన్.వి.రమణయ్య, కార్యదర్శి పి. ఆంజనేయులు, బి.ఉదయ భాస్కరరావు, బాబు, జి.శ్రీనివాసరావు, వి.వెంకటేశ్వర రావు, జె.వి.ఎన్. కృష్ణమూర్తి తదితరులు పాల్గొన్నారు.

## వ్యాసరచన పోటీలు

నెల్లూరు లయన్స్ సేవాప్రియ క్లబ్ ఆధ్వర్యంలో వ్యాసరచన పోటీలు జరిగాయి. 29తేది వి.ఆర్. హైస్కూలు ఆవరణలో జరిగిన పోటీలో 391 మంది సీనియర్ విభాగంలో; 57మంది జూనియర్ విభాగంలో పోటీలోపాల్గొన్నారు. విజేతలకు గాంధీ జయంతి రోజు హోటల్ శివం ఇంటర్నేషనల్‌లో బహుమతి ప్రదానం చేస్తున్నట్లు సేవాప్రియ అధ్యక్షులు శ్రీమతి డి.జ్యోత్స్న చెప్పారు.

## నెల్లూరులో గాంధీ జయంతి

జాతిపిత మహాత్మా గాంధీ 127 జయంతి ఉత్సవాన్ని డిసిసి ఇందిరా భవన్‌లో ఘనంగా జరిపింది. డిసిసి అధ్యక్షుడు ఆనం సంజీవ రెడ్డి గాంధీజీ విలువిత్తు చిత్రపటానికి పూలమాల వేసి శ్రద్ధాంజలి ఘటించారు. ఈ కార్యక్రమంలో మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి, డిసిసి కార్యదర్శి సిహెచ్ దేవకుమార్ రెడ్డి, మాజీ ఎమ్మెల్యే శివి సుబ్బారెడ్డి, మహిళా నాయకురాళ్లు పందిళ్లపల్లి అరుణమ్మ, బివి [illegible] తదితరులు పాల్గొన్నారు. గాంధీ బొమ్మ వద్ద గాంధీ విగ్రహానికి మార్కెటింగ్ మంత్రి బి. రమేష్ రెడ్డి, మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి విడివిడిగా పూలమాలలు వేసి శ్రద్ధాంజలి ఘటించారు. జిల్లా పరిషత్ కార్యాలయంలోని గాంధీ విగ్రహానికి సిఇఓ బ్రహ్మేంద్ర రావు పుష్పమాల వేసారు. ఈ కార్యక్రమంలో ఎస్సీ కార్పొరేషన్ ఇడి వెంకట రామిరెడ్డి, ప్రొబెషన్ డిప్యూటీ కలెక్టర్ లక్ష్మీకాంతం తదితరులు పాల్గొన్నారు.

## గాంధీ జయంతిని జరిపిన ఆర్యవైశ్య సంఘం

నెల్లూరు జిల్లా ఆర్యవైశ్య సంఘం గాంధీ జయంతి వేడుకలను స్టోన్‌హౌస్ పేటలోని అన్నదాన సమాజంలో జరిపారు. సమావేశం నుంచి గాంధీ విగ్రహం వరకు ప్రదర్శన జరిపి పూలమాలలు వేసి తిరిగి వచ్చారు. అనంతరం కనమర్లపూడి తిరుమల రావు అధ్యక్షతన సభ జరిగింది. ముఖ్య అతిథిగా విచ్చేసిన ఆర్యవైశ్య మహాసభ రాష్ట్ర కార్యదర్శి దొంతి విశ్వనాథం మాట్లాడుతూ రాష్ట్రంలో 60 లక్షల మంది వైశ్యులు వున్నా రాజకీయంగా వారికి సరియైన ప్రాతినిధ్యం లేదని ఆవేదన వ్యక్తపరిచారు. సభలో ఆర్యవైశ్య సంఘం ప్రధాన కార్యదర్శి కొండపల్లి సుబ్రహ్మణ్యం, గుండ్లపల్లి మోహన్ రావు పాల్గొన్నారు. లయన్ వై. శ్రీనివాస రావు, ప్రొఫెసర్ నారాయణ రావును ఈ సందర్భంగా సత్కరించారు.

## అరుణమ్మచే పండ్లు పంపిణీ

మహాత్మా గాంధీ జన్మదినాన్ని పురస్కరించుకొని భక్తవత్సల నగరలోని కుష్టు నివారణ కేంద్రం, మదర్ థెరిస్సా కేంద్రాలలోని వారికి పట్టణ మహిళా కాంగ్రెస్ ఆధ్వర్యంలో పళ్లు పంపిణీ చేసారు. కార్యక్రమంలో పట్టణ మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ, ప్రియదర్శిని, లావణ్య మహిళా మండలి సభ్యులు పాల్గొన్నారు.

## ఎఫ్.సి.ఐలో హిందీ మాసోత్సవాలు

బృందావనంలోని భారత ఆహార సంస్థ కార్యాలయంలో ఆగస్టు 15నుంచి సెప్టెంబరు 14వరకు హిందీ మాసోత్సవాన్ని పాటించారు. 12తేది ఈ సందర్భంగా ఎఫ్.సి.ఐ జిల్లా ఇన్‌ఛార్జ్ మేనేజర్ డి. వెంకటేశం అధ్యక్షతన సభ నిర్వహించారు. రాజ భాష అయిన హిందీని ఉద్యోగు లందరూ ఆఫీసు వ్యవహారాలలో సాధ్యమైన చోట వాడాలని జిల్లా మేనేజర్ కోరారు. రచయిత పచ్చిపులుసు వెంకటేశ్వర్లు, దక్షిణ భారత హిందీ ప్రచార సభ నిర్వహించిన పోటీల్లో నాలుగు రాష్ట్రాల్లో ప్రథమురాలిగా నిలచిన కుమారి [illegible] హేమమాలిని ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు. ఈ సందర్భంగా నిర్వహించిన హిందీ వక్తృత్వ పోటీలలో విజేతలకు ఎం. ముజీబ్‌ఖాన్, జి.వి. వెంకటేశ్వర్లు బహుమతులందజేశారు. హిందీ సెల్ అసిస్టెంట్ మేనేజర్ కె. కోదండ రామిరెడ్డి వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది.

మద్రాసుకు మంచినీరు, రాయలసీమకు సాగునీరు
కాంగ్రెస్ చేసిన మహోపకారాలే!

# తెలుగు గంగ కోసం తెలుగు దేశం చేసిందేమిటి?

ఎట్టకేలకు, చిట్టచివరకు తెలుగు గంగ జలాలు తమిళనాడుకు చేరాయి. ఆంధ్ర ప్రదేశ్ ప్రజల స్నేహ, సౌహార్ద భావాలను, తెలుగు జలం ద్వారా అందు కొంటున్నారు తమిళ సోదరులు. ఇరుగు పొరుగు రాష్ట్రాల ప్రజలు పరస్పర అవగాహంతో, మిత్రత్వంతో, సామరస్య దృక్పథంతో సహజీవనం చేయడానికి ఇటువంటి చరిత్రాత్మక సంఘటనలు ఎంతో దోహదం చేస్తాయి.

అయితే రెండు రాష్ట్రాల ప్రజల సౌభ్రాతృత్వంతో జరిగిన ఈ శుభకార్యాన్ని స్వల్పమైన స్వార్థ రాజకీయాల కోసం దుర్వినియోగం చేయడానికిముఖ్య మంత్రు లిరువురూ ప్రయత్నించడం విచారకరం. కోట్లాది జనహృదయాలలో తీయటి గుర్తుగా మిగిలి పోవలసిన కార్యక్రమాన్ని తుచ్ఛమైన ఎన్నికల రాజకీయాలకు వాడుతున్నారు – చంద్రబాబు నాయుడు, కరుణానిధి లిరువురూ!

అందువల్లె వారు అంత హడావుడిగా ఈ ప్రారంభోత్సవ కార్యక్రమం జరిపించారు. మద్రాసు మేయర్ పదవికి కరుణానిధి కుమారుడు స్టాలిన్ పోటీ చేస్తున్నాడు. రాజకీయంగా ఆ సుపుత్రుడి పరిస్థితి క్లిష్టంగా వుంది. అందువల్ల మద్రాసు నగర వాసులను ఆకట్టుకొనే ప్రచారాస్త్రంగా తెలుగు గంగను వాడదలిచా రాయన. ఆయనకు చంద్రబాబు సహకరించారు. ఈ తొందర వల్లనే మద్రాసు ప్రజలు తెలుగు గంగ నీళ్ల బదులు – ఛత్రివాక ఏటిలోని వాననీళ్లను అందుకున్నారు. అసలు తెలుగు గంగ జలాలు కాలువకు పడిన రంధ్రాల నుంచి కారిపోయి, పొలాలను ముంచెత్తు తున్నాయి. మరొక నెల రోజుల పాటు ఓర్పు వహించి, కాలువ నిర్మాణం పూర్తి చేసి, లోటుపాట్లు పరిశీలించి, ఆ తర్వాత ప్రారంభోత్సవ కార్యక్రమం జరిపి వుంటే – ఆ కార్యక్రమ ఘనత నిల్చి వుండేది.

ఈ సభలో ముఖ్యమంత్రు లిరువురూ – "జాతీయ పార్టీలు చెయులేని పనిని ప్రాంతీయ పార్టీలు ఏ విధంగా చేయగలవో తెలుసు కోవడానికి ఈ మంచి నీటి పథకమే తార్కాణం" అని మహోపన్యాసాలు దంచారు. ఇంకొక తెలుగు మంత్రి అసెంబ్లీలో ప్రసంగిస్తూ – "తెలుగు దేశం ప్రారంభించి పూర్తి చేసిన ఈ పథకం గురించి మాట్లాడే హక్కు, కాంగ్రెస్ పార్టీకి లేదని; రాయలసీమ సాగునీటి వసతి కల్పన మొదట లేకున్నప్పటికీ, తెలుగు దేశం ప్రభుత్వం ఆ వసతి కల్పించి తెలుగు గంగ పథకం రూపొందించిందని" వ్యాఖ్యానించారు.

ఈ ఉపన్యాసాలు వింటే ఆశ్చర్యం కల్గుతూంది. ఈ ముఖ్యమంత్రులకు, మంత్రులకు చరిత్ర తెలియ కుండా పోయి వుండాలి; లేదంటే తెలిసీ ప్రజలను మభ్యపెట్టను యత్నిస్తున్నా రనుకోవాలి. చరిత్ర పుటలు తిరగేసి చూస్తే తెలుగు గంగ పథకం సమస్తం కాంగ్రెస్ పార్టీ తలపెనని అర్థమౌ తుంది.

> "ఇందిరమ్మ చొరవ, ఆనాటి కాంగ్రెస్ ముఖ్యమంత్రుల జాతీయ దృక్పథంతో మంజూరైన పథకమిది; ప్రాంతీయ పార్టీలు ఎప్పటికీ చేయలేని పని అది"

**శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి**
**(మాజీ ముఖ్యమంత్రి)**

1964 భువనేశ్వర్ కాంగ్రెస్ మహాసభలోనే ఈ పథకానికి నాంది ప్రస్తావన జరిగింది. ఆనాడు కేంద్రంలో డిప్యూటీ నీటిపారుదల మంత్రిగా వుండిన శ్రీ ఒవి అలగేశన్ ఈ ప్రస్తావన తెచ్చి, నెహ్రూ సహాయం అభ్యర్థించారు. అందుకు నెహ్రూజీ సమ్మతించి, మద్రాసుకు కృష్ణ జలాలను సరఫరా చేయడానికి తన వంతు సహాయం చేస్తానని ఆ సభలోనే ప్రకటించారు.

అప్పటి నుంచే ఈ ప్రయత్నం మొదలైంది. తిరిగి 1976లో తమిళనాడు ముఖ్యమంత్రి స్వర్గీయ అన్నాదురై ఆనాటి ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీని మద్రాసుకు ఆహ్వానించి; నగర వీధులలో ఆమెను పూలతేరుపై వూరేగించి, బ్రహ్మరథం పట్టి, కృష్ణా జలాల విషయం విజ్ఞప్తి చేశారు. ఇందిరమ్మ అప్పటి కప్పుడే, మద్రాసులోని అతిథి గృహం నుంచి మహారాష్ట్ర (ఎస్‌బి చవాన్), కర్ణాటక (దేవరాజ్ అర్స్), ఆంధ్ర (జలగం వెంగళ రావు) ముఖ్యమంత్రులతో ఫోనులో మాట్లాడి, తమ తమ వాటాల నుంచి ఐదేసి టిఎంసిల నీరు ఇవ్వడానికి వారిని ఒప్పించి; ఆ సాయంత్రమే మెరీనా బీచ్‌లో జరిగిన సభలో ఆమె ఆ విషయం ప్రకటించారు. జాతీయ దృక్పథంతో, జాతీయ సమైక్యత పెంపొందించ డానికి ఆనాడు జాతీయ కాంగ్రెస్ అధ్యక్షురాలుగా వున్న ఇందిరమ్మ, ఈ ముగ్గురు కాంగ్రెస్ ముఖ్యమంత్రులనూ ఈ విషయంలో ఒప్పించింది. ఆనాటి ముగ్గురు ముఖ్యమంత్రులూ ప్రాంతీయ సంకుచిత దృక్పథంతో కాకుండా, విశాల జాతీయ భావాలతో అందుకు సమ్మతించారు. అప్పట్లో ఆ రాష్ట్రాలలో ప్రాంతీయ పార్టీలు అధికారంలో వుండి వుంటే – ఈ పథకం వచ్చేది కాదు.

ఆనాటి నుండే మద్రాసు నగర తాగునీటి పథకం ఇన్వెస్టిగేషన్ కోసం ఒక క్రొత్త డివిజన్ కడపలో పనిచేయటం ఆరంభించింది. మద్రాసుకు నీటిని పైపుల ద్వారా తీసుకు వెళ్లాలా? లేదా కాల్వ ద్వారా తీసుకు వెళ్లాలా అనే విషయమై తర్జన భర్జన జరిగాక, కాల్వ ద్వారా సరఫరా చేయడానికే నిర్ణయించారు. ఈ కాలువను ఇరిగేషన్‌కు వాడకూడదని తతిమా రెండు రాష్ట్రాలూ అభ్యంతర పెట్టాయి. కాని ఆనాటి ఆంధ్ర కాంగ్రెస్ ప్రభుత్వం అందుకు అంగీకరించక షరతులతో కూడిన అగ్రిమెంటు (1977 అక్టోబరు 17)లో సంతకం చేసింది. అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వమే రాయుల సీమ వ్యవసాయానికి నీరందించే పథకానికి నాంది పలికిందనే విషయం గుర్తుంచు కోవాలి. ఆ రోజు ఆంధ్ర ప్రభుత్వం తతిమా రెండు రాష్ట్రాల ఒత్తిడికి లొంగి వుంటే, నేడు తెలుగు గంగ పథకం ద్వారా సాగు నీరందించే వీలు కల్గేది కాదు. ఒప్పందం ప్రకారం మద్రాసు నీటికి ఆఫ్‌టేక్ పాయింట్ కడప జిల్లాలో చెన్నముక్కపల్లిగా నిర్ణయించి ఆ పాయింటు వరకు ఎవరూ ఆక్షేపణ చేయడానికి ఆస్కారం లేకుండా చేయబట్టి రాయలసీమ వ్యవసాయానికి సాగునీరు కల్పించే అవకాశం కలిగింది. అయితే ఆనాటి తమిళనాడు ముఖ్యమంత్రి స్వర్గీయ ఎమ్.జి. రామచంద్రన్ దీనిపై సందేహాలు వ్యక్తం చేశారు; తరచుగా క్షామానికి గురయ్యే రాయలసీమ ప్రాంతం నుండి కాల్వ ద్వారా మద్రాసుకు నీటిని తరలించడం జరుగు తుందా; మధ్యలో వారు ఆటంకాలు కల్పించరా? అనే అనుమానంతో ఈ పథకానికి ప్రత్యామ్నాయ పథకాలు ఆలోచించారు. దీన్ని ప్రక్కన బెట్టి, అందుకు బదులుగా మద్రాసుకు కావేరి జలాలు సరఫరా చేసే విధంగా ఒక పథకం రూపకల్పన చేసి కేంద్ర జల సంఘం అనుమతి పొంది, దానికి తగిన నిధులు కూడా

> "మద్రాసుకు నీళ్లివ్వడానికి లేదని ప్రకటించడమే కాదు, ఏనాడూ ఈ ప్రాజెక్టుకు బడ్జెట్‌లో ప్రాధాన్యత ఇవ్వలేదు ఎన్‌టిఆర్; కాంగ్రెసే దీన్ని పూర్తి చేసింది"

[illegible] 8 పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Nayagara Paper Products (India) Limited, Nellore